# వ్యామోహము

(సాంఘిక నాటకము)

రచయిత:

వేదము వేంకటరాయశాస్త్రి, ఎమ్. ఏ.

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4. మల్లికేశ్వర గుడిసందు, లింగిసెట్టివీధి,

జి. టి. మదరాసు.

1952

Copy Right

రు 1-0-0

## ఇందలి స్త్రీపురుషులు

---

స్త్రీలు—

1. సుశీల (నాయిక)
2. మిస్ పారిజాతం (నాయిక స్నేహితురాలు)

పురుషులు—

1. కుటుంబరావు (నాయకుఁడు)
2. సూర్యారావు (నాయకుని స్నేహితుఁడు)
3. సుబ్బయ్య (నాయిక తండ్రి)
4. రామయ్య (సుబ్బయ్య మిత్రుఁడు)
5. జానకిరామయ్య (క్లబ్ కార్యదర్శి)
6. స్టేషన్ కూలివాఁడు
7. వేలు (సర్వెంటుబాయి)

---

# వ్యామోహము

## దృశ్యము ౧

[సుబ్బయ్యగారి యిల్లు. సుశీల రాములవారి పటమునకు హారతి ఇచ్చుచుండును]

ఎన్నటికి నీదయగల్గునో । శ్రీరామ నాపై॥ ఎన్న॥
ఎన్నటికి నీదయగల్గు । నెన్నటికి నాదిగులుదీఱు
నిన్నినాళ్లవలెనే నిలపై । నికతిరుగలే॥ ఎన్న॥
కన్నవారు నవ్వగ నోర్వలే । నన్న హానుమ
త్సన్నుతాంఘ్రియుగ నీదాన । నిన్నుగాన॥ ఎన్న॥
పన్నగరాణ్మృదుచరణ । పక్షిరాడ్గమన సుప్ర
సన్నానన ఆదినారాయణ దాసాధీశ శ్రీరామ ఎన్నటి॥

[అని నిష్క్రమించును.

[సుబ్బయ్య రామయ్యలు ప్రవేశింతురు]

సుబ్బ—రామయ్యగారూ, చూచారా, ఇలాగు పూజలూ పురస్కారాలు చేస్తున్నది మా అమ్మాయి సుశీల. మా అల్లుడు ఈవూరికి ఇటీవలే వచ్చాడు. కలెక్టరు కచ్చేరిలో సథ్యా తాత్కాలికంగా ఒకపనిలో ప్రవేశించాడట. ఆ పూర్వవైష మ్యాలింకా మనస్సులో పెట్టుకొన్నట్టున్నాడు. మీరువెళ్లి కాస్త మాట్లాడాలి. నా కింకెవరూ ఆప్తులులేరు.

రామయ్య—సుబ్బయ్యగారూ మీరు నన్నింతగా అడగాలా. తప్పకుండా వెళ్లి మాట్లాడ్తాను. కుటుంబరావొచ్చాడని నేనూ విన్నాను. బి. ఏ. ప్యాసైనాట్ట. మీకార్యం సాధించడం నాపని. ఇదుగో ఇవాళే వెళ్తాను.

సుబ్బ—ఏమంటారంటే అతనితోటి ......

రామ—ఆ చెప్పండి.

సుబ్బ—మాయావదాస్తి అతనిదే అనండి. ఏం కావలె నన్నా సిద్ధమనండి. ఇలారండి సావకాశంగా చెప్తాను.

[ఇద్దరు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౨

[కుటుంబరావు గది]

[కుటుంబరావు రామయ్య మాటలాడుచు ప్రవేశింతురు]

రామయ్య—ఇదుగో కుటుంబరావ్ నామాటవిను. నీవు ఎజుకేటెడ్ ఫెలోవిగాని బ్రూటువిగావు. జరిగిపోయిందేమో జరిగిపోయింది. చిన్నతనంలో నీకు మ్యారేజైంది. ఇప్పుడు ఆ వైఫ్ వద్దంటే దానిగతి ఎలాగు? ఆలోచించు మైడియర్ యంగ్ మ్యాన్.

కుటుం—రామయ్యగారు, వద్దండీ ఆప్రస్తావమే వద్దండి. మరేదైనా సంగతి మాట్లాడండి. [కూర్చుండి] ఈవేళ పేపరు చూచారా ?

రామయ్య—[కూర్చుండి] నాకెందుకబ్బాయి ఈ వెధవ పేపరు, ఏముంటుంది దాంట్లో, నాలుగు వెధవసంగతులు తప్పితే. నేనువచ్చినసంగతి నీ కుటుంబ వ్యవహారం.

కుటుం—అవునండీ, ఎప్పుడో చిన్నతనంలో నాకు జ్ఞానం లేనప్పుడు పెళ్లిచేస్తే దానికి నేను జవాబుదారీ ఔతానా? లోక మంటే ఏమో తెలీదు, పెళ్లంటే ఏమో తెలీదు, ఆవయసులో పెళ్లిచేసి 'అబ్బాయి నువ్వు పూచీ' అంటే నేను పూచీపడనండీ. అది వివాహంకాదు, ఏదో నాటకాభినయం. పెద్దవాళ్లు మమ్మల్ని వేషధారుల్ని చేసి ఆటచూచి సంతోషించారు. అంతే.

రామ—నీవు జవాబుదారీ పూచీ అని అంటున్నానా ? అదికాదు విషయం. నిన్ను ఆలోచించమంటున్నాను.

కుటుం—దీనికి ఆలోచ నేముంది? ఆ పిల్లకు ఎజుకేషనూ లేదూ ఏమీలేదు; వట్టి కంట్రీ గరల్.

రామ—అబ్బాయి, నామాటవిను. మనం పూర్వసాంప్ర దాయాల్ని ఇంకా వదల్లేదు. మాకు మీకు చాలా తేడావుంది. నీవు బి. ఎ. ప్యాసైనావు ఇరవైరెండేళ్లకే. ఆవయసుకు మేం ఓల్డుమెట్రిక్యులేషనుకు వచ్చేటప్పటికి మహాక్లేశమైంది. అందుకే మెట్రిక్లేషన్ మహాక్లేశం అని చమత్కారంగా మనపెద్దలు అనే వారు. ఐదారుమాట్లు ఫెయిలయితేనే గాని ప్యాసయ్యేవారు కారు. మేము మొదట జుట్టు టోపీ, తర్వాత మొన్న మొన్న ననంగా క్రాఫింగులోకి దిగాం. మీరు ఆదినుంచీ క్రాఫింగే. ఈ పంట్లాం మేమెరగం. మీరంతా ఎప్పుడూ సాయబుల్లాగ ఇంట్లో

కూడా పంట్లాములూ పరాయీలు తొడిగి తిరుగుతుంటారు. కట్టు బొట్టు జుట్టూ అంతా మాకాలానికి మీకాలానికి ఎంతో మారిపోయ్యింది. అసలు మానాయన పట్టువేసి ఎరగడు. ఐతే ఇదంతా ఎందుకు చెప్పవచ్చానంటే పెళ్లిళ్లవిషయంలో మనం ఇంకా పక్వంకాలేదు. మన ఆంధ్ర దేశంలో ప్రతికుఱ్ఱాడికీ చిన్న తనంలో పెళ్లిచెయ్యడం సాంప్రదాయం. అంచేత లాభంలేక పోలేదు. మాఘాదరు మనమడికీ ఉపనయనంచేయించి తర్వాత పోయినాడు. మా ముత్తాత నన్నుచూచి మరీ అవతారం చాలించాడు. అదీ మనపద్ధతి. అలాగే మీఫాదరు నీకుగూడా చిన్నతనంలో పెళ్లి చేసి కళ్లారా చూచి, పాపం, అల్పాయుస్సుగా పోయాడు.

కుటుం—హీవాజ్ ఎ ఫూల్. శుద్ధ తెలివి తక్కువవాడు. చదువుకొన్నాడు. ఎందుకా చదు వంటూ ? ఆయన పొరబాటుకు ప్రతిఫలం నే ననుభవిస్తున్నాను.

రామ—[ఆశ్చర్యముతో] ఆ! ఎంతమాట! ఫూలా! హారి హారి! ఉం. సరే, నాయనా. మంచో చెడ్డో తల్లిలేని కుఱ్ఱాణ్ణి నిన్ను గారాబంగా పెంచాడు, పెళ్లి చేసి కుటుంబం నిలపాలని చూచాడు. ఆ పెళ్లి పీటలమీద లాంఛనాలదగ్గర మీకు మన స్తాపాలువచ్చాయి, ముఖావలోకనాలుకూడ లేకుండావచ్చాయి. సరే ఆ గొడవంతా ఎందుకులే. నీకు మనస్సుకు కష్టంగా ఉంటుంది. ఇంతా ఎందుకు చెప్పవచ్చానంటే పదిహేనేళ్లై నాయీ నువ్వూ ఆ అమ్మాయిని చూచి. పది హేనుకాకపోతే

పన్నెండు. మంచో చెడ్డో మీనాయన చేశాడనుకో, అయి పోయింది. నీ జవాబుదారిలేదు; నిజమే. ఇప్పుడు ఆ అమ్మాయి గతి ఎలాగు?

కుటుం—నన్నడుగుతారేం? నాకు తెలియదండీ.

రామ—హిందూధర్మం ఒకటుంది నాయనా.

కుటుం—హిందువొకటి ధర్మమొకటి ఇన్ని ఉన్నాయా? మీధర్మశాస్త్రాలంతా ఎగిరిపొయ్యేకాలం వచ్చిందండీ! కామన్ సెన్స్ లేకపొయింతర్వాత ఏ ధర్మశాస్త్రం నిలుస్తుందండీ. మానవుడి సహాయానికి ధర్మశాస్త్రంగాని ధర్మశాస్త్రంకోసం మానవుడు పుట్టలేదు.

రామ—వివాహం బ్రహ్మముడి, దేవుడువేసిన ముడి నాయనా.

కుటుం—మనం విప్పేద్దాం. బ్రహ్మ ఏమిటండీ ముడివెయ్యడం, యం బ్రహ్మలు మనంవేస్తుంటే.

రామ—హిందూ మ్యారేజ్ ఈజె సాక్రమెంట్. చాల పవిత్రమైంది. అగ్నిముందు చేసినప్రమాణం తప్పకూడదు.

కుటుం—తెలిసిచేస్తే ప్రమాణంగాని చిలుకపలుకులు ప్రమాణాలౌతాయా? సినిమాపెళ్ళిళ్ళు నిజంగా పెళ్ళిళ్ళేనాండీ?

రామ—పెద్దమనిషైన అమ్మాయిని ఎంతకాలం ఆపెద్దమనిషి ఇంట్లో ఉంచుకొని కాపాడుతుంటాడు. ఈ పిల్లవిషయం చింతచేతే పిల్లతల్లి నిరుడు మంచంపట్టి వెళ్ళిపోయింది. కార్యాలకైనా నువ్వువస్తావేమో అంటే రాలేదు. ఉద్యోగంలో ప్రవేశిం

చిన నీదగ్గిరికి పంపించాలని పూర్తిఆశతో ఉంటే పాపం, ఆతండ్రి ఆశను వ్యర్థంచేయకు.

కుటుం—నావల్ల తప్పులేదండీ.

రామ—ఆ అమ్మాయిలో ఏమైనాలోపమా?

కుటుం—ఎజుకేషను లేదండీ. ఇంగ్లీషు ఒకఅక్షరం రాదు. నాఫ్రెండ్సు చూస్తే ఏమంటారు. నాకు తలవంపుగా ఉంటుందండీ సొసైటీలో. ఐ వాంట్ ఆన్ ఎజుకేటెడ్ వైఫ్.

రామ—నేర్చుకుంటుంది నాయనా నిమిషంలో.

కుటుం—రబ్బిష్. ఆవేషం, ఆవైఖరి, ఆ ఉండడం నేను చూళ్లేనండీ. నాకు మతిచెడిపోతుంది.

రామ—ఒక్కతే కూతురు. బోలెడు ఆస్తి. నీవు లక్షణంగా ఈ గుమాస్తాగిరి మానేసి బి. ఎల్., చదివి మదరాసులో ప్రాక్టీసు పెట్టి దర్జాగా ఉండొచ్చు.

కుటుం—దిబ్బలోకొట్టవయ్యా నీ ఆస్తిని. ఐయామ్ ఎ ప్రిన్సిపిల్డుమ్యాన్ సార్. నాకేం ఒకనీతి నియమం లేదనుకున్నారా? డబ్బాప్రధానం? నా ఉత్తరువు లేకుండా చిన్నతనంలో పెళ్లి చెయ్యడం, మీరుచేసిన పిచ్చిచేష్టలకు బాధ్యత నాదనడం, తర్వాత నాకిష్టమున్నా లేకపోయినా శాశ్వతంగా నేను దాంతో వేగడం- చాలాబాగుంది మీధర్మశాస్త్రం. బాబూ నాకక్కర లేదు. నేను పిలిపించుకోను; ఎంతమాత్రం పిలిపించుకోను. ఈ వెధవ క్లార్కుపోస్టుకు రాజీనామాయిచ్చి వెళ్లిపోతాను. మెడ్రాసులో నన్నుఎక్కడని మీరువెతుకుతారు. ఎందుకొచ్చా

నురా ఈవూరికి నిడుంది. మీబాధతప్పితే అంతేచాలు. నాకు నచ్చినదాన్ని పెళ్ళిచేసుకుంటాను. చక్కగా ఇంగ్లీషు చదివిన వాళ్లు, ఇప్పుడు S. S L. C. ప్యాసైనవాళ్లు, చాలామందున్నారు. వరదక్షిణ అక్కరలేదంటే పరిగెత్తుకొస్తారు.

రామ—ఎందుకొస్తారబ్బాయి? బ్రహ్మచారిని వెతుక్కొస్తారుగాని.

G 9388

కుటుం—ఆ! ఏమన్నారూ? నా బ్రహ్మచర్యానికేంతక్కువండీ? సంసారం చేశానా? పరిశుభ్రమైన బ్రహ్మచారినండీ ఏమనుకొన్నారో! తెలుసా? నిష్కల్మషమైన జీవితమండీ నాది.

రామ—[నవ్వుచు] ఆ. ఆ. కోప్పడకు కుటుంబరావు. నువ్వు అగ్నిహోత్రంతో సమానుడివి. నేనెరుగుదును. అంటే, ఎందుకు చెప్పవచ్చానంటే, పెళ్లిఅయినవాడివని, మరేమీలేదు. అందులో పెద్దింటి సుబ్బయగారి అల్లుడికి పిల్లమీద పోటీగా పిల్లను ఎరిగినవాడెవడూ ఇవ్వడు బంధువులలో.

కుటుం—ఇవ్వకపోతే ఫీడపోయింది. నాకునచ్చినదాన్ని, ఏజాతైనాసరే, ఎజుకేషనుండేదాన్ని చేసుకొని, మీకంటెదటుండకుండా వెళ్లిపోతాను. నాకు సోషల్‌గా ఉండాలి. [గడియారం చూచుకొని] అయ్యో నాకుసెలవు, పనుంది. [అని పోబోవును.]

రామ—[లేచి] కాస్త పెద్దమనస్సుచేసుకొని ఆ అమ్మాయిని పిలిపించుకోనేమార్గం చూడు.

కుటుం—ఎన్ని మాట్లు చెప్పమంటారండీ. పిలిపించుకోను, పిలిపించుకోను, ఎంతమాత్రం పిలిపించుకోను.

[అని త్వరగా నిష్క్రమించును.

రామ—ఓరి భగవంతుడా! ఈకాలపుకుఱ్ఱాళ్లకు బొత్తిగా మతిపోతూవుందే. కానీచూస్తా, మళ్లీ. [గట్టిగా] ఇదుగో కుటుంబరావ్, ఒకమాట, వినవేను.          [అనుచు నిష్క్రమించును.

---

## దృశ్యము 3

[సుబ్బయ్యగారి యిల్లు]

[సుబ్బయ్య రామయ్యలు మాటలాడుచుందురు. సుశీల దూరము నుండి వినుచుండును]

సుబ్బ—ఏమంటాడు మా అల్లుడు.

రామ—ఏమంటాడూ, ఏమీవినేటట్టులేదు. కుఱ్ఱతనం మాటలూ వాడూను. ఆ కాలేజిలో నేర్చుకొన్న మాటలు కొన్ని పారేశాడు నామీద. అతనికి చిన్నతనంలో, ఏమీ తెలిసీతెలియనివయసులో పెళ్లిచేశారట, అందుకు తాను జవాబుదారీ కాడట. తనకా అమ్మాయి ఇష్టంలేదట. ఎడ్యుకేషను లేదు, ఫ్యాషను లేదు, సోషల్‌గా ఉండదు వద్దంటాడు. ఉద్యోగానికి రాజీనామాఅన్నా ఇచ్చి ఎక్కడికైనా పోతాట్ట. తనకునచ్చిన ఏ వెధవజాతిదాన్నో చేసుకుంటాట్ట. నేను మంచిగా చెబుతూంటే వినిపించుకోకుండా గబగబా ఏదో వాగేశి చక్కా లేచిపోయాడు. వెనకనేవెళ్లితే నాకు అందలేదు.

సుబ్బ—డబ్బెంతైనా యివ్వడానికి సిద్ధమని చెప్పకపోయి నారూ.

రామ—అయ్యో. అది మానేస్తానా? ఒక్కతే అమ్మాయి బోలెడాస్తి. అంతా నీదేనోయి, హాయిగా బి. ఎల్. చదివి అడ్వొకేటు అయిపొమ్మని చాలాదూరం చెప్పాను. మీడబ్బేమిటి వెధవడబ్బు అక్కరలేదని హుంకరించాడు. ప్రిన్సిపిల్సట ప్రిన్సిపిల్సు అతనికి. చాలానీతికి కట్టుబడినవాడట తాను.

సుబ్బ—ఐతే ఏమిటి ఫలితార్థం ?

రామ—ఎజుకేషను కావాలట, ఫ్యాషన్‌గా ఉండాలట, ఇంగ్లీషుముక్కలు గబగబావాగుతూ క్లబ్బుల్లో వీధుల్లో బజారువెంబడి షికార్లుకొడుతూ ఉండాలట. మీఅమ్మాయి పాతకాలం అమ్మాయి అని అంటాడు.

సుబ్బ—పోనీ, ఓదొరసాన్ని ట్యూషను పెట్టి నేర్పిద్దాం. మా అమ్మాయి మహాచురుకైందిలెండి. రెండునెలల్లో బి. ఏ. లలాగ తయారౌతుంది. మన కూర్గురు దొరసానమ్మను ఆస్పత్రి నుండి పిలిపించి ట్యూషను మొదలుపెట్టించనా ?

రామ—తొందరపడకండి, ఆస్పత్రి దొరసానమ్మను పిలిపిస్తే లోకం మరోలాగు అనుకొంటుంది. అసలు పని చెడుతుంది. సుబ్బమ్మగారూ ఇకమీద ఇంగ్లీషు నేర్పుతుందండీ ?

సుబ్బ—ఎందుకురాదూ ?

రామ—మీఅమ్మాయి నడగండి.

సుబ్బ—అమ్మా, సుశీలా ఇలా రాఅమ్మా.

[సుశీల వచ్చి ఎదుట నిలుచును]

సుబ్బ—వింటున్నావా మామాటలు.

సుశీ—వింటున్నాను నాన్నా.

సుబ్బ—ఇంగ్లీషట నేర్చుకుంటావా ?

సుశీ—నాకు ఇంగ్లీషంటే అసహ్యం. దానిమీదమనస్సు పోదు నాన్నా.

సుబ్బ—మరిఫ్యాషన్ గీషన్ వగైరాలు వచ్చేదెలాగు?

సుశీ—ఫ్యాషనులు నాకలవాటులేదు నాన్నా. చేసుకోబోతే ఏదో శిగ్గుగాఉంటుంది.

రామ—శిగ్గేమితల్లీ. పాతకాలంలా ఉంటే ఈకాలపు కుఱ్ఱాళ్లు కన్నెత్తిచూడరు.

సుశీ—ఫ్యాషన్‌లో నీతి నియమం ఉంటుందండీ ?

రామ—బాగాచెప్పావు. అసలు ఫ్యాషన్‌కే ఒక నీతి నియమంలేదు. రోజూమారేదది. మరికాస్త సోషల్‌గాఉండాలంటాడే.

సుశీ—అంటే ఏంచెయ్యాలండీ?

రామ— ఏముందీ కొంచెం పౌడరు, స్నో, వగైరాలు మొహానికి లెప్పుకొని బాగా డ్రెస్సు, కాలేజీ గరల్సులాగా చేసుకొని, నలుగురిలో నిర్భయంగా తిరుగుతూ, మీటింగులకు వెళ్లుతూ, మొగవాళ్లని గడ్డిపరకకు సమానంగా చూస్తూ, ఎవరేమనుకుంటారోఅన్న బిడియంలేకుండా ఘట్టిగా చెడవాగుతూ, ఆడా మొగా భేదంలేకుండా మనుషుల్నితోసుకొని నడుస్తూ,ఉపన్య

న్యాసాలిస్తూ, వీపంతా జొపడేలాగ చేసుకొంటూ నాగరికుల్లాగ ఉండాలి.

సుశీ—అదంతా నాకు అలవాటులేదండి. నాజీవితం ఈ విధంగా అయిపోయింది. ఎక్కడికంటే అక్కడికిపోయి అందరిలో తిరుగుతూ నేను ఉండలేనండి. నేను ఇలాగేఉండి కుళ్లి చచ్చి పోతాను. [అని కన్నీరునించుచు నిష్క్రమించును.

రామ—[చింతతో సుశీలను చూచుచుండి] అయ్యో పాపం! ఏంజేస్తుంది. వయసువచ్చిన అమ్మాయి, చుట్టూ అందరూ భర్తలతో కాపరంచేస్తుంటే చూస్తూ తాను ఇలాఉండాలంటే ఎంతకష్టం!

సుబ్బ—రామయ్యగారూ ఇలావుంది నాయిల్లు. నాకు ఇవొక్కతే కూతురుకావడం, దీనితల్లి ఈమధ్యనే వెళ్లిపోవడం దీనిసంసారం ఇలాఉండడం ఇదంతాఏమిటో! నాకు చెడ్డకాలం. వాడూ నాకు వేలువిడిచినమేనల్లుడే. భగవంతుడే రక్షించాలి.

[తెరలో—'అంతా నేనుచూచుకొంటాను నువ్వువెళ్లిరా']

సుబ్బ-'అంతా నేనుచూచుకొంటా'నంటున్నారు ఎవరో? ఆడగొంతులాగుంది.

రామ—మంచి ఉపశ్రుతి. అంతా భగవంతుడు చూచుకొంటాడండీ. శుభం. మీకు మంచికాలం వొస్తూంది.

[మరల తెరలో—'సుశీలా సుశీలా']

సుబ్బ—పారిజాతం లాగుంది. మాసుశీలతో చిన్నప్పుడు ఆడుకొన్నఅమ్మాయి, మొన్ననే మద్రాసులో బి. ఏ. ప్యాసైందని

విన్నాను. ఇప్పుడే వచ్చినట్టుంది, మద్రాసునుండి, [అనినిష్క్రమించి మరల ప్రవేశించి] రా అమ్మా రా.

పారి—[ఫ్యాషనుగా తయారై ప్రవేశించి తెరవైపు చూచి] ఒరే నువ్వువెళ్లు సూర్యారావు చాలాథ్యాంక్సు ఆ సంగతంతా నేను చూచుకొంటానులే.

సుబ్బ—రా అమ్మా రా. ఎప్పుడురావడం? ఏమిసంగతి? బి. ఏ. ప్యాసైనావట. ఎన్నాళ్లైంది నిన్నుచూచి! మనిషే మారిపోయినావే! నీగొంతుబట్టి గుర్తుపట్టాను. ఊర్కే వచ్చి నిలబడి ఉంటే పోల్చుకోలేకపోదును.

పారి—వచ్చాను మామయ్యా. రిజల్టుకోసం అక్కడే ఉన్నాను. మొన్ననే వచ్చింది. నిన్న బయలుదేరివచ్చేశాను. మీదయవల్ల బాగాప్యాసైనాను. సెకండుక్లాసు వచ్చింది.

సుబ్బ—సెకండుక్లాసేమిటి ఫస్టులోరావలసింది. అతనెవరా అబ్బాయి?

పారి—సూర్యారావని నాకు కాలేజీమేటు. ఎమ్. ఏ. ఈ ఊరే. మేమిద్దరం కూడా వచ్చాం.

సుబ్బ— ఏమిటమ్మా అంతా చూచుకొంటానంటూ వచ్చావు?

పారి— మా కాలేజీసంగతండి. విద్యార్థులలో కలతొస్తేను అదంతా నేను సర్దుతానన్నాను.

రామ—[ఆలోచించుచు] ఈ అమ్మాయిని నేను ఇదివరలో చూచినట్టున్నానే. ఆ. మహాబలం వెంకట్రావుగారికూతురుగదూ?

మద్రాసులో చదువుతూందని లోగడ, అంటే, ఎనిమిదేళ్లయింది, అప్పుడే, అప్పుడు చూచాను. ఆ! జ్ఞాపక మొచ్చింది. ఏ మమ్మాయి జ్ఞాపకముందా నన్ను ?

పారి—[నిదానించి] ఆ. పరోపకారం రామయ్యగారు.

రామ—బలే కనుక్కొన్నావు.

పారి—ఎప్పుడో చిన్నప్పుడు చూచానండి. వెంటనే పోల్చుకోలేక పోయాను. క్షమించండి.

రామ—చాలాసంతోషం, నువ్వు ఇంతగొప్పగా చదువుకో రావడం.

పారి—[సుబ్బయ్యగారితో] మీదేనండి అన్యాయం. పాపం సుశీలను ఎందుకూకాకుండా చేశారు.

సుబ్బ—ఏంచేస్తాం. గ్రహాచారం.

పారి—ఏదీ సుశీల, ఎప్పుడూ నాకెదురొచ్చేది. కాపరానికి పంపించారా?

సుబ్బ—అంత అదృష్టమా? లోపలుంది.

పారి—సుశీలా, సుశీలా. [అనుచు లోపలికిపోవును.

రామ—సుబ్బయ్యగారూ నిదానించండి. మళ్లీ ఓమాటు కలుసుకొని చెప్పిచూస్తాను. పదిమాట్లుచెప్పితే ఎక్కకపోతుందా బుఱ్ఱకు. తర్వాత భగవంతుడున్నాడు. ప్రస్తుతం సెలవు.

సుబ్బ—పాపం నాకోసం మీరు చాలా శ్రమపడుతు న్నారు. స్నేహితులంటే నాకు సథ్యా మీరే. మీయింటిపేరు సార్థకం.

రామ—ఆ, ఇదెంతమాత్రం. మీ అమ్మాయి సుఖపడితే అంతే చాలు నాకు. ఈమాత్రం చెయ్యలేకపోతే నేను పరోప కారం రామయ్యనుకాను. వస్తాను. [అని నిష్క్రమించును.

సుబ్బ—పారిజాతంతో మాట్లాడాలి.

[అని మరొకవైపు నిష్క్రమించును.

---

## దృశ్యము ౪

[పారిజాతం సుశీల మాటలాడుచు ప్రవేశింతురు]

పారి—సరే సుశీలా, పోయిందేమో పోయింది. ఈవిధంగా ఏడిస్తే ప్రయోజనమేమి ?

సుశీ—నన్నేం జెయ్యమంటావు చెప్పు ?

[సుబ్బయ్య ప్రవేశించి కూర్చుండి వారిమాటలు వినుచుండును]

పారి—నామాట వింటావా ఒకఉపాయముంది చెప్తాను.

సుశీ-చెప్పుపారూ నీమాట అక్షరం దాటకుండా చేస్తాను.

పారి—చేస్తావుగదా. సరి, ఒకసంగతిచెప్పు. మీకు వివాహమై పదిపన్నెండేండ్లయినవా ?

సుబ్బ—ఆహా! పూర్తిగా పన్నెండు.

పారి—కదా మామయ్యా, కుటుంబరావు మళ్లీ సుశీలను ఎప్పుడన్నా చూచాడా ?

సుబ్బ—లేదు, కన్నెత్తిచూడలేదు. ఈవీధికే అసలురాడు.

పారి—కాబట్టి [ఆలోచించుచు] నిన్నుచూస్తే ఎంత మాత్రం పోల్చుకోలేడు.

సుబ్బ—అంతేనమ్మా. చూచుంటేగా అసలు ఎదిగిం తర్వాత.

పారి—అంచేత నేను సుశీలచేత ఒకనాటక మాడిస్తాను.

సుబ్బ—నాటకమా? సుశీలేమిటి వేషంవేసే దేమిటమ్మా!

పారి—[నవ్వుచు] ఆ స్టేజినాటకం కాదు మామయ్యా, ఒకతమాషా చేయిస్తా నన్నమాట. గొప్పవినోదం. నేను కథంతా విన్నాను మామయ్యా, నాకిప్పుడే సుశీల చెప్పింది. రామయ్య గారు పాపం చాలా శ్రద్ధతో పనిచేస్తున్నారట కూడాను.

సుశీ—చెప్పుపారూ, ఏమిటో ఆ వినోదం.

పారి—నువ్వు నాలాగు డ్రెస్సువేసుకొని క్లబ్బుకెళ్లాలి.

సుశీ—క్లబ్బుకే!

పారి—అతను నిన్ను పోల్చుకో లేడుగా. భయపడ తావేం. అక్కడ నీచేత నేను ఇంగ్లీషు మాట్లాడిస్తాను.

సుశీ—గారడీవిద్య నేర్చుకువచ్చావా యేం? నాకేమీ అర్థం కావడంలేదు నువ్వు చెప్పడం.

పారి—ప్రత్యక్షం పరోక్షానికంటే ఆశ్చర్యం. పరోక్షం ప్రత్యక్షానికంటే ఆశ్చర్యం. కథలకంటే ఆశ్చర్యాలు సాక్షాత్తుగా జరుగుతున్నాయి. అంతా నీకు మామయ్యకూ రామయ్య గారికీ వివరంగా చెప్పి పనిచేస్తానుచూడు. రండి భోజనాలు కానియ్యండి. నేను పెద్దప్లాను వేస్తున్నాను.

---

## దృశ్యము ౫

[కుటుంబరావుగది. కుటుంబరావు సూర్యారావు మాటలాడు చుందురు]

సూర్యా—అది సరేనబ్బాయి నువ్వు నీవైపును చూచి ఎన్నాళ్లయిందోయి ?

కుటుం—సూరి, పన్నెండేళ్లయిందిరా. పెళ్లిరోజు ఏంచూ చానోగాని మళ్లీచూడలేదు. మనఃస్పర్ధలు వచ్చాయి. అంతే. అటువైపు పురుగు ఇటువైపు ఇటువైపు పురుగు అటువైపు తల చూపలేదోయి.

సూర్యా—మళ్లీ ఒకమాటు ఎక్కడైనా సందర్భం చూచుకొని చూడరాదటోయి.

కుటుం—నో. డోంట్ వాంట్. నాకక్కరలేదు. మనిషి రకం మొదట్నే తెలుసు. ఎజుకేషను లేకపోయింతర్వాత అంతా అధమమేగదట్రా. ఓల్డు ఫ్యాషన్. వాళ్లకుటుంబమే బాక్ నంబర్సు. అతనుచూడు పూజాపురస్కారం, రామాయణం, భగవద్గీత, పట్టుబట్ట పంచపాత్ర. వట్టి వైదికచాదస్తం.

సూర్యా—చాలా ఫేర్ గరలోయి.

కుటుం—ఏడవడానికా, మాట్లాడడానికి ఒక ముక్క యింగ్లీషు రాకపోయింతర్వాత. క్లబ్బుకి పిలుచుకోపోవడానికి ఏమైనా పనికొస్తుందా ? టెన్నిస్, పింగ్ పాంగ్ ఏమైనా వచ్చునా ? బూడ్సు అంటె ఏమిటి, ఫేస్ పౌడరంటే ఎలా

ఉంటుంది, ఎన్నడైనా ఎరుగుందా? మేకప్ ఏమైనా ఉందా? చేతౌనా? పాతకాలం అవ్వల్లాగ చీరలు గీరలూ. వీధిలో మానంగల మాడర్నె యంగ్‌మ్యాన్ ఎవడన్నా అలాంటి గర ల్‌తో వెళ్తాడటోయి? ఏమిటో నాకుచెప్పవస్తున్నావు.

సూర్యా—చాలా అల్ట్రామాడర్నెగా ఉన్నావే. నీకు ఏదోఇంగ్లీషుగరల్‌గాని పనికిరానట్టుందే. ఎక్కడనో యూరప్‌లో పుట్టవలసిన వాడివోయి. సరేగాని ఇదంతా నీకవిత్వమా లేక చూచి చెప్తున్నావా?

కుటుం—వినడం చాలదటోయి. చెప్తావిను ఇంకా. వాళ్ల నాన్న దాన్ని గుమ్మందాటి బయటికి పోనీడు. అదీ పోదు. సూర్యారావు, ఆ పిల్ల ఇప్పటికి సూర్యాలోకనం చెయ్యలేదని రామయ్యే అన్నాడు.

సూర్యా—దానికి సూర్యాలోకనం ఉందోలేదో గాని వైజాగ్‌లో చదువుతూవుండిన వాడికి నీకుమాత్రం దాని ఆలో కనంలేదు. దానికిమాత్రం నీ లోకమేనని విన్నాను.

కుటుం—వకాలతు పుచ్చుకొనివాచ్చావా యేం, వకీలు లాగ మొదలెట్టావు. ఎప్పుడూ ఇంట్లోనే కుళ్లుతూవుండే కూపస్థ మండూకం ఎవడికి కావాలోయి, పైగా మా కుటుంబ కలహాలు చాలాఉన్నాయి లే. నీకుతెలీదు. అది సరేగాని నేను ఒకపని చేశాను తెలుసా?

సూర్యా—ఏంచేశావయ్యోవ్ మహానుభావా? ఎక్క డన్నా రహస్యంగా మరోపెళ్లి చేసుకున్నావా యేం?

కుటుం—[నెమ్మదిగా] ఏంచేశానంటే, నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాను.

సూర్యా—హరి, నీకేం పొయ్యేగాలంరా, లక్షణమైన ఉద్యోగంవదలుకొని.

కుటుం—బిజినెస్, బిజినెస్, బిజినెస్.

సూర్యా—ఏంబిజినెస్సురోవు?

కుటుం—టాయిస్, టాయిస్. ఆటవస్తువులోయి. జపాను నుంచి దిగుమతిచేసి అంగళ్లకు మొత్తంగావేశేస్తాను. అక్కడి కంపెనీలకు ఏజన్సీపట్టానోయి.

సూర్యా—బలేవాడివిరా.

కుటుం—ఈమాడెల్సు చూడు. [అని ఒకపెట్టెతీసి] మన ఇండియన్ మాడెల్సు అమెరికావాళ్లకు కావాలట. ఈబుద్ధుడు, ఈగోపురం, గణపతి, నటరాజ, ఈడాన్సింగ్ అప్సరస, ఈద్వార పాలకుడు, ఇవన్నీ డ్రాయింగ్మాష్టరు అయ్యావుా అయ్యరు చేత డ్రాయింగులువ్రాయించి అమెరికాకు పంపించాను. మన కొండపల్లిబొమ్మలు, పుదుచ్చేరి రకాలు, మద్రాసు కొశపేటరకాలు ఇవికూడ పంపించాను. సాంపిలు నచ్చితే ఆర్డర్లు దొర్లుతాయి.

సూర్యా—నాతోచెప్పలేదేమిరా ఇన్నాళ్లూ?

కుటుం—ఎందుకుబాబూ! నీవు ఊళ్లో దండోరావెయ్య డానికా, దాంతో నామామగారూ ఆయనకూతురూ నాయింటికి ముట్టడివెయ్యడానికా? ఏమీా అక్కర్లేదు. పలక్కుండా ఒక్క రాత్రి డేరా ఎత్తివేసి మెడ్రాస్ వెళ్లాను. ఆ మహాసముద్రంలో నన్ను ఎవడూ కనుక్కోలేడు.

సూర్యా—ఓరి నీయిల్లుబంగారంగానూ. అసాధ్యుడివిగా ఉన్నావు గదరా!

కుటుం—నాయిల్లు నిజంగానే బంగారంతో నిండిపోతుం దోయి. సూర్యారావు నాకు తెలిసిపోయింది, నాభార్య, దాని తండ్రి ఏదో ఆలోచించి దాన్ని తెచ్చి నాదగ్గర వదలిపెట్టిపోవ డానికి పెద్దఎత్తు వేస్తున్నారు. ఆయన రామయ్యగారు నెలగా రోజూవచ్చి నాకు హితోపదేశంచేసి వెళ్తున్నాడు. నేను తిరగ్గొ ట్టేస్తున్నాను. అదీవిషయం, అబ్బాయి గ్రహించు. [దూరము నిదానించి చూచి] ఆ వచ్చేదెవరూ? అతనేనోయి ఆరామయ్య. అనుకొంటేవస్తుందట దయ్యం. నేను లేనని చెప్పిపంపించెయ్యి. [అని నిష్క్రమించును.

రామ—[కుటుంబరావ్ అనుచు ప్రవేశించి] ఓహో సూర్యారావా? ఏంనాయనా కుటుంబరావేడీ?

సూర్యా-ఇంకా ఇంటికిరాలేదండి. నేనుకూడా కనిపెట్టుకొని ఉన్నాను, చాలాసేపట్నుంచి. పోదామని బయల్దేరుతున్నాను.

రామ-సరేగాని సూర్యారావు, ఏమంటాడు కుటుంబ...

సూర్యా—[సగములో నిలిపి] రండి అవతలికి పోయి మాట్లాడుకొందాం. [ఇరువురు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౬

[సుబ్బయ్యయింటి ముందు గది]

[రామయ్య సూర్యారావు మాటలాడుచుందురు. సుబ్బయ్య వినుచుండును]

రామ—పాపం, పారిజాతం ఒకనెలగా కష్టపడి సుశీలకు కొన్ని యింగ్లీషుముక్కలు నేర్పింది. దేవుడు మేలుచేస్తే అన్నీ కలిసిరావాలి. బోధపడిందా? నువ్వు పారిజాతం కలిసి ఈ ప్రయత్నం చెయ్యండి. పాపం ఆ అమ్మాయికుటుంబం బాగుపడుతుంది.

సూర్యా-తప్పకుండా చేస్తాను. ఆ అమ్మాయి పాపం మహా ఉత్తమురాలు. వాడేమో సుశీలను చూచింది పెళ్లప్పుడట, మళ్లీ చూచి ఎరగడు. ఇప్పుడు చూడమంటే ససేమిరా వద్దంటాడు. నా కతని సంగతంతా తెలుసులెండి. పారిజాతం వేసినప్లాను బాగుంది.

రామయ్య—నీచేతులోఉంది నాయనా.

సుబ్బ—కాస్త ఉపకారంచెయ్యి సూర్యారావు.

సూర్యా—తప్పకుండానండి. మీరింతదూరం చెప్పాలా?

రామ—సుబ్బయ్యగారూ నేనువెళ్లి మళ్లీ పొద్దున కలుసుకుంటాను. [అని నిష్క్రమించును.

సూర్యా—నేనూ అందాక వస్తాను.
[అని నిష్క్రమించును.

సుబ్బ—భగవద్గీత ఓమాటు చదువుకొంటాను.
[అని నిష్క్రమించును.

---

## దృశ్యము ౭

[పారిజాతమును సుశీలయు ఆధునికవిద్యార్థినులవలె అలంకరించుకొని ప్రవేశింతురు. సుబ్బయ్య సంధ్యవార్చుచుండును.]

పారి—సుశీలా, ఈటెన్నిస్ బాట్ పట్టుకో. ఇవాళనుంచి నువ్వు పారిజాతం నేను సుశీలను.

సుశీ—సరే బాగుంది నీ ఉపదేశం.

పారి—ఈ నెలరోజులుగా నేను నేర్పిన ఇంగ్లీషుముక్కలు పారెయ్యి. పూర్తివాక్యాలు మాట్లాడొద్దు. యస్, నో, ఆల్ రైట్.

సుశీ—నువ్వు చెప్పిందంతా చేస్తాను గాని ఎవరైనా చేస్తే తంటావస్తుందే.

పారి—ఎవరూచెప్పరులే సుశీలా. ఆ కాదు, పారిజాతం. నువ్వు ఇప్పుడు టెన్నిస్ ఆడుతావు, పింగ్ పాంగ్, చెస్ అన్నిట్లో నీకు శక్తిఉంది. క్లబ్బులో తళుక్కున అవుపడి వచ్చేస్తూఉండు. అతనికే ఎక్కువగా అవుపడు. తర్వాతి కథంతా నేనుజరిపిస్తాను. మన సూర్యారావు వున్నాడుగా కూడా.

సుశీ—నన్ను ఇంగ్లీషులో ఉపన్యాస మివ్వమంటే నావల్ల కాదు.

పారి—అన్నిటికీ సరేనంటుండవే. యస్, యస్ అను. సర్ టెన్లీ, గ్లాడ్లీ, విత్ ఆల్ మైహార్టు, అని సమయోచితంగా చెప్తూండు. కాంట్ స్పీక్ ఆఫ్ హాండ్ అను. గొప్పగొప్పవాళ్లు కూడా వ్రాసిచదువుతారు. నీకు తెలీదు. ధారాళంగా మాట్లాడేవాళ్లు ఏ కొద్దిమందో ఉంటారు. ఇంకా ఉపాయాలున్నాయి. వస్తానన్నసమయం తప్పించి ఏదైనా అపాలజీవ్రాసి పంపిద్దాం. లేకపోతే ఉపన్యాసమేవ్రాసి పంపించి గొంతు బాగులేదని ఎవరినైనా చదువమందాం. నువ్వేవ్రాశావని అతగాడను కొంటాడు.

సుశీ—నాకేమో భయంగానూ సిగ్గుగానూ ఉందే.

పారి—ఏమీలేదు. ఇదుగో ఈ హ్యాండ్ బ్యాగ్ తీసికో; ఈ కాగితములు, విజిటింగ్ కార్డులూ వగైరాలుండనీ అందులో, వెళ్లి నాటకమాడిరా. ఈవేళ మొదటిరోజు, కొద్దిగా ఆడు.

[తెరలోనుండి—మిస్ పారిజాతం]

పారి—అదుగో సూర్యారావొచ్చాడు.

సూర్యా—[ప్రవేశించి] మిస్ పారిజాతం.

పారి—హాలో సూరీ. కమెలాంగ్ కూరో్చ.

సూర్యా—రెడీనా, సిద్ధంగా ఉన్నారా?

పారి—ఏపారిజాతం కావాలి? ఒరిజినలా డూప్లికేటా?

సూర్యా—ఈకాలంలో ఒరిజినలెవరిక్కావాలి. నకలే.

పారి—సరే పారూ నువ్వు క్లబ్బుకి వెళ్లు చదువుకొన్న దానివి. నేను వంటయింటి కెళ్లి నాపని చూచుకుంటాను. [ఒక యడుగుపోయి మరలి వచ్చి] ఇదుగో సుశీ నీవు క్లబ్బునుంచి వచ్చేటప్పుడు ఇక్కడికి మొదటరాకుండా పబ్లిక్కుగా మా యింటికిపోయి రాత్రి రా ఇక్కడికి.

[సుశీలా సూర్యారావులు నిష్క్రమింతురు.

సుబ్బ—[లేచి] పాపం, తెలియని పిల్ల, ఏం జేస్తుందో. మళ్లీ భర్తని కలుసుకోడానికి అన్ని మారోపాయాలకీ లొంగుతూ ఉంది. ఆ ఆశ అలాంటిది. నేను గుడికి వెళ్లివస్తాను. ఆపద్బాంధవా, జగద్రక్షకా, శ్రీరామా.

[అనుచు నిష్క్రమించును.

పారి—లల్లలల్లలా లల్లలల్లలా
కుదిరి పోయెగా ప్లాను కుదిరి పోయెగా
కుదిరిపోయె సుశీలకూ కొంత ఫ్యాషనూ
కుటుంబయ్య దాన్ని చూచి కూలబడునుగా
మూర్ఛపోయి తెప్పిరిల్లి మూల బడునుగా
గుర్తు తాను పట్టలేడు కొంతకూడ పోల్చుకోడు
కోరి కోరి దాన్నిచూచి కొంచుపోవుగా
వెంట కొంచుపోవుగా.

ఆలుమొగుడు కలసి మెలసి ఆడుచుండగా
చూడవలెను పెద్దలెల్ల చూడ్కిమిగులగా
కుదిరిపోయెగా ప్లాను కుదిరిపోయెగా
లల్లలల్లలా లల్లలల్లలా [అనుచు నిష్క్రమించును.

---

## దృశ్యము ౮

[క్లబ్బు. చెస్సు ఆడుచు ఇరువురు, పేకఆడుచు ఇరువురు. పేపరు చదువుచు కుటుంబరావు, ఏవో కాగితములు తిరుగ వేయుచు జానకిరామయ్య ప్రవేశింతురు.]

కుటుంబరావు [చూచి] ఎవరో ఆవచ్చేగరల్, సూర్యారావుతో వస్తూంది. చూస్తే ఎజుకేటెడ్‌లా కనిపిస్తూంది.

సూర్యా—[ప్రవేశించి] హలో గుడ్‌మార్నింగ్ మిస్టర్ కుటుంబ్.

[సుశీల ప్రవేశించును.]

కుటుం—వెరిగుడ్‌మార్నింగ్ [అని సుశీలనుచూచును.

సూర్యా—[సుశీలతో] దిస్ ఈజ్ మై ఫ్రెండ్ మిష్టర్ కుటుంబరావు B. A. ఎ ఫైన్ జంటిల్‌మ్యాన్.

సుశీ—గుడ్‌మార్నింగ్ సర్.

కుటుం—గుడ్‌మార్నింగ్ మ్యాడమ్.

సూర్యా—దిస్ లేడీ ఈజ్ మిస్ పారిజాతం. B. A. మనవూరే, వెంకట్రావుగారిడాటరు.

కుటుం—వెరిహ్యాపీ టు మేక్ యువర్ అక్వాయింటెన్స్.

సుశీ—థాంక్యూసర్ [అని తనసంచినుండి విజిటింగ్ కార్డిచ్చును. అచ్చట ఆడుచుండినవారు ఆటనిలిపి వీరిని చూచుటకు ప్రారంభింతురు.]

సూర్యా—కమెలాంగ్ ప్లీస్. వుయిగెట్ ఆల్మోస్టు ఆల్ జర్నల్స్ [అని నాలుగుపత్రికలుత్రిప్పి] దిస్ ఈజ్ మిస్టర్ జానకిరామారావు అవర్ సెక్రిటరీ. [అని ఒకనినిచూపును]

సుశీ—నమస్కారాలండీ.

జానకి—నమస్కారాలండి.

సూర్యా—వుయిహ్యావ్ ఎ గుడ్‌లైబ్రరీ.

సుశీ—ఓ, వెరిగుడ్.

సూర్యా—మా తెలుగు లైబ్రరీ కంప్లీటండి.

సుశీ—మీ ఆక్టివిటీసేమిటండి ?

సూర్యా—చెప్పవయ్యా కుటుంబరావ్. ఈ క్లబ్బుకి ఈయన పండితుడండి. డాక్టర్ జాన్సన్. [అందఱు నవ్వుదురు.

కుటుం—అయాంసారీ, నువ్వు చెప్తాంటే ఇంటర్ఫియర్ కాగూడదని నేనూర్కున్నాను. వుయి ప్లే ఆల్ గేమ్స్. ఔట్ డోర్-టెన్నిస్ బాడిమింటన్.

సుశీ—వెరిగుడ్.

కుటుం—టెన్నిస్ కొంచెం సస్పెండ్ చెయ్యాల్సొచ్చింది.

సుశీ—అయాంసారీ, వీలుంటే ఐవాంటు ప్లే.

కుటుం—ఓ వెరిసారీ, వెరిసారీ.

సుశీ—డోంట్ వొర్రీ.

కుటుం—ఇండోర్-గేమ్స్, చెస్. పింగ్‌పాంగ్, అఫ్ కోర్స్‌కార్డ్సు. [అందఱు నవ్వుదురు]

సుశీ—మెంబర్సు ఎందరండి ?

కుటుం—అబౌట్ హండ్రెడ్.

సుశీ—ఎక్సలెంట్.

కుటుం—ఫైనార్ట్‌స్ సెక్షన ఒకటుందండి. వుయిస్టేజ్ డ్రామాస్.

సుశీ—వెరిగుడ్.

కుటుం—ఐయాం ఇన చార్‌జ్.

సుశీ—చాలాసంతోషమండి.

సూర్యా—యూ నో కుటుంబ్, షి ఈజే గుడ్ ఆక్ట్రెస్. షీ సింగ్స్‌వెల్. చాలా బాగాపాడుతారు.

సుశీ—నో నో. బాగా పాడ్లేనండి. యూ సీ, చిన్నప్పుడు చంద్రగిరి వెంకమ్మ కాస్తనేర్పింది. అంతేనండి.

కుటుం.—చంద్రగిరి వెంకమ్మే! మహానుభావురాలు. అధ్యాత్మ రామాయణాలు ఆవిడ పాడితే వినాలి.

సుశీ—భాషావిషయం ?

సూర్యా—షీ ఈజింటరెస్టెడ్ ఇన్ టెలుగు. రాజగోపాల రావుగారి స్టూడెంటు.

కుటుం—ఐసీ. మస్ట్‌బి ఎ గుడ్ స్కాలర్. వుయి కండక్ట్ పీరియాడికల్ మీటింగ్స్. లెక్చర్లు అప్పుడప్పుడు పెట్టిస్తామండి. లాస్టు మంతు గందరగోళం పెద్ద శాస్త్రులువారి అష్టావధానం పెట్టించాం. మొన్న ప్రతివాది భయంకరం ఆచార్లవారు అజ్ఞాన ధ్వాంత చండభాస్కరంమీద ఉపన్యాసం చేశారు.

సూర్యా—ఇప్పటికి అచ్చైన తెనుగు నావల్సన్నీ చదివేశారోయి పారిజాతమ్మగారు.

కుటుం—ఒండర్‌ఫుల్.

సూర్యా—రండి మాబిల్డింగ్ చూడండి. [అని ఇద్దరు లోపలికి పోవుదురు. కుటుంబరావుకూడ పోవును.

జానకి—మిస్ పారిజాతం! ఈ వూళ్లో ఈ అమ్మాయిని నా చిన్నతనంలో చూచినట్టున్నాను. పెద్దదైంది. చాలా మారిపోయింది. ఆనవాలు తెలియలేదు. మెంబరు కమ్మంటాను. మన నాటకాలకు కుటుంబరావుకు తగిన హీరోయిన్ లేదు.

[మరల ఆముగ్గురు ప్రవేశింతురు.

జానకి—వెల్ మిస్టర్ సూర్యారావ్, విల్ మిస్ పారిజాతం బి ప్లీజ్‌డు టు బికం ఎ మెంబర్

సూర్యా—ఏమండీ మీరు దయచేసి మెంబరవుతారా?

సుశీ—విత్ ఆల్ మై హార్ట్.

అందఱు—థ్యాంక్స్, థ్యాంక్స్, థ్యాంక్స్.

సుశీ—మీ కెవరైనా ఇంతవరకు లేడీ మెంబర్స్ ఉన్నారాండీ?

జానకి—సారీ, లేరండీ. ఈవూళ్లో ఎజుకేటెడ్ లేడీస్ లేరండి. ఉన్న ఒకరిద్దరూ పూర్వాచారంగా ఉన్నారండి. మీరంటే ఏదో ఫార్వర్డుగా ఉన్నారు.

సుశీ—అయితే ఈవూళ్లో మెంబరుకావడం తప్పేమో?

జానకి—ఓ నోనోనో [అనినవ్వి] ప్లీజ్ బికం ఎ మెంబర్, వుయి రిక్వెస్ట్యూ.

కుటుం—యస్. ఐ యాల్సో రిక్వెస్ట్యూ.

సుశీ—ఆల్ రైట్, ఫారమేదండి.

జానకి—ఐవిల్ ఫిలప్ ఫర్ యూ.

కుటుం—లెట్ మీ డూ యిట్ [అని కాగితము లాగఁబోవును.

సూర్యా—జాగ్రత్త. మీనడమ కాగితం కాస్తా చినిగిపోతుంది.

జానకి—[వ్రాసి] ప్లీజ్ సైన్.

సుశీల—[చేవ్రాలు చేయును. పర్సునుండి పదిరూపాయలు తీసి] ఎంతండి సబ్స్క్రిప్షన్.

జానకి—ఓ చాలానామినలండి రెండురూపాయలు.

సుశీ—[పదిరూపాయలు మరల పర్సులో పెట్టుకొని ]ఇదుగో [అని రెండురూపాయ లిచ్చును.]

జానకి—మెని థ్యాంక్స్. [అని రసీదిచ్చును.

సూర్యా—వుయిటేక్ లీవ్. మనం వెళ్దామా?

సుశీ—అందరికే నమస్కారలండీ.

జానకి—మీరు తరు చొస్తుండాలండి క్లబ్బుకు. రోజూ వస్తే చాలామంచిది. మీవల్ల మాక్లబ్బుకు ఒకస్టేటస్ వస్తుంది.

సుశీ—అబ్బా.

కుటుం—మళ్లీ లైఫ్ వస్తుంది.

సుశీ—ఇది టూమచ్. వస్తూంటాను లెండి. [అని కుటుంబ రావును చూచుచు నిష్క్రమించును. ఆమె కర్చీవ్ క్రింద పడి పోవును, ఎవరును చూడరు.]

కుటుం—[తన్మయుఁడై సుశీలపోయినవైపే చూచును] సీమ్సు టు బి ఎ ఫైన్ గర్ల్.

జానకి—ఎ ఫైన్ లేడీ. ఏం కుటుంబరావు. మెడ్రాస్ బి. ఏ. నోయి, మన ఫెలోస్ కంటె బెటరుగా మాట్లాడుతారు.

కుటుం—సరేలే. ఏవైనా డిబేట్స్ పెట్టిద్దాం. [తనలో] ఈ సూర్యారావుగాడు దీనివెంట తిరుగుతున్నాడు. బహుశా తగులుకుంటాడేమో! [ప్రకాశము] నేను వెళ్తా నాకు టైమైంది.

జానకి—యస్ క్లోజింగ్ టైమైంది. అందరంపోదాం.

[అని కాగితములు సర్దుకొని బయలుదేరును. ఇతరులు ఒకరొకరుగా నిష్క్రమింతురు.

కుటుం—[క్రింద కర్చీఫ్‌చూచి తనలో] ఎవరిదీ కర్చీఫ్! పారిజాతంది.

జానకి—పోదామా ? [అని నిష్క్రమి

కుంటు—ఆ [రెండడుగులు జానకిరామయ్యతో పోయి మరలివచ్చి]-ఈ కర్చీఫు నేనుంచుకుంటాను.

[అని తీసికొని నిష్క్రమించును.

---

## దృశ్యము ౯

[సుబ్బయ్యయిల్లు. సుబ్బయ్య, రామయ్య, పారిజాతం, సూర్యా రావులు ప్రవేశింతురు]

సుబ్బ—ఒక్క నెలలో ఎంతపనిచేశావమ్మా పారిజాతం నువ్వు. నిజంగా నీకు ఇంత మేధాశక్తి ఉందని నేను అనుకోలేదు.

పారి—ఏం ఉందండీ, మానవమన స్తత్వం కనుక్కొంటే అంతా సరిపోతుంది. నేనుమాత్రం తెలిసిచేశానా ? ఏదో పాచిక వేస్తే పారింది.

రామ—నేను రోజూ అతగాడిదగ్గిరికెళ్లి మాట్లాడి చెయ్యలేకపోయిందాన్ని ఇంట్లోనుంచి రథంనడిపి ఈ అమ్మాయి చేయిస్తుందంటే నిజంగా ఎక్కడో మంత్రిత్వానికి తగింది గాని ఇంకొకటిగాదు.

పారి—ఇదంతా ఎందుకండీ. ఇంకా మనకు పని పూర్తి కాలేదు. సూర్యారావు, ఏమంటాడు కుటుంబ్.

సూర్యా—ఏమంటాడూ ఇక. పాపం విరహవేదనపడి పోతున్నాడు. సుశీల నిజంగా పారిజాతమని, చాలా చదువు

కొన్నదని, అలాంటిది తనకు దక్కకపోతే విషంతాగో రైలు కిందపడో చచ్చిపోతానని అంటున్నాడు. నాతో చాలాదీనంగా నాలుగురోజులక్రితం చెప్పుకొన్నాడు. మ్యారేజి ప్రపోజు చెయ్యాలని ఉంవట. ఎలా చెయ్యడమని, పెళ్లాడమని అంటే ఏమంటుందో అని భయపడుతున్నాడు.

సుబ్బ—బలే. సెబాష్.

రామ—ప్రయోగమంటే తిమ్మరుసు ప్రయోగమే మా పారిజాతండి.

సుబ్బ—వెధవాయా నీసొంత పెళ్లామేనోయి అంటే.

పారి—కొంప మునిగిపోతుంది. ఇంకేముందీ తర్వాత. ఇంతదూరం కట్టినకట్టడం ఒక్కదెబ్బతో నేల కూలిపోతుంది. ఆ మ్యారేజేమో కానిచ్చి తర్వాత చూద్దాం. తొందరెందుకూ.

రామ—ఔనండీ తొందరపడకండి.

సూర్యా—వాళ్లఫాదర్ను వెంకట్రావుగార్ని అడగమన్నాను. చాలాభయపడ్డాడు. బ్రహ్మచారైతే అడగొచ్చుగాని పెళ్లైవుందిగా. మళ్లీ నే నేమన్నానంటే 'మిస్ పారిజాతం అంటే నువ్వేమో అనుకొన్నావు. చాలా నోబుల్ లేడీసుమా. తర్వాత నీకు శృంగభంగం అవుతుంది, జాగ్రత్తగా పనిచెయ్యన్నాను. [నవ్వుచు] భయపడుతూ మహాసంకట పడుతున్నాడు.

పారి—మంచిదే లే. ఆమాత్రంలో ఉండనీ. అతనిసబ్జెక్టేమిటి సూర్యారావు.

సూర్యా—మ్యాథ్సు.

సుబ్బ—అంటే ఏమిటి.

పారి—లెక్కలండీ. అయితే సూర్యారావు ఈమాటు వెళ్లి మిస్ పారిజాతంది పాలిటిక్సని చెప్పు. నేను సుశీలను తయారుచేస్తాను. ఒకమాట [అని సూర్యారావును దూరముగా పిలుచుకొనిపోయి చెవిలో ఏదోచెప్పును.]

సూర్యా—సెబాష్. అరేంజిచేస్తాను. అదిగనక ఐతే తొంభై పాళ్లు మనపని ఐనట్టే; సుబ్బయ్యగారూ, రామయ్యగారూ, ఇహ మీరు హాయిగా నిద్రపొండి. పిట్టను వలలో పడేస్తాం. నిమిషంలో మాపని పూర్తౌతుంది. నాకుసెలవు.

[అని నిష్క్రమించును.

సుబ్బ—రామయ్యగారూ దేవు డిన్నాళ్లకు కళ్లు తెరిచాడండి. రండి బజారుకెళ్లి కూరగాయలు తెద్దాం.

[ఇద్దరు నిష్క్రమింతురు.

పారి—సుశీ. [అని లోవైపు నిష్క్రమించును.

---

## దృశ్యము ౧౧

[క్లబ్బు హాలు. డాన్సుకు ఏర్పాటు జరుగుచుండును]

[కుటుంబరావు, సూర్యారావు, జానకిరామయ్య ప్రవేశింతురు]

కుటుం—ఏమండీ సెక్రటరీగారూ, రైటుటైముకే మొదలుపెడతారా డాన్సు.

జానకి—తప్పకుండా. మన ఫ్రెండ్సుయూనియన్ నాటకాలూ పార్టీలు వగైరా ఎప్పుడూ రైటుటైం తప్పిందిలేదు,

కుటుం—అందుకు కాదయ్యా, డాన్సింగ్ పార్టీ వచ్చిందా?

జానకి—పార్టీ రెడీగా ఉన్నారు. ఇంక రెండు నిమిషాల్లో కార్యక్రమం మొదలౌతుంది. మిస్ పారిజాతం వచ్చారా? ఇన్విటేషన్ పంపించానే.

సూర్యా—అదుగో కూచో ఉన్నారు.

జానకి—మీరు వెళ్లి కూచోండి. [కుటుంబ-సూర్యా-నిష్క్రమింతురు.

జానకి—[తెరవైపు చూచి] మహాజనులారా నేడు మన ఫ్రెండ్స్ యూనియన్ వారి యాజమాన్యమున పూర్ణావతి అనే అమ్మాయి నాట్యంచేస్తుంది. మీరందరు సావధానంగా చిత్తగించవలెనని ప్రార్థిస్తున్నాను. [అని నిష్క్రమించును.

[రెండవ తెరయెత్తఁగా పూర్ణావతి నాట్యముచేయును]

నాట్యము ముగియఁగానే జానకిరా-[ప్రవేశించి] పూర్ణావతీదేవి మన ప్రార్థనను మన్నించి ఉచితంగా మనసభలో నాట్యము చేసినందుకు మా సంఘముతరఫున నాతరఫున అభినందిస్తున్నాను. ఇంతసేపు సావధానంగా మీరందరు ఉన్నందుకు మీకు వందనాలు.

[పూర్ణావతి నిష్క్రమించును.

[సుశీల, సూర్యారావు, కుటుంబరావులు ప్రవేశింతురు]

సుశీ—ఇదంతా భాగుంధిగానీండి, ఏదైనా నాటకం వేయించకపోయినార్థూ.

జానకి—ప్రయత్నించామండి. బొబ్బిలియుద్ధం వెయ్యాల‌ని మొదలుపెట్టి—

సుశీ—యుద్ధం చేశారా ?

జానకి—ఆ. అంతాఅయింది. రెడునెలలు శాస్త్రిగారే దగ్గరుండి రిహార్సలు చేయించారు. ఇంతకంటె కన్యాశుల్కం మంచిదని ఇది మానేశాం.

సుశీ—అదైనా వేశారా ?

జానకి—ఎందుకు వేస్తాం? అదీ మానుకొన్నాం. మాసభలో చాలాపార్టీ లున్నయిలెండి దేవాసురసంగ్రామాలు జరుగుతూనే ఉంటాయి. ఆఖరుకు ఒకనేత్రోత్సవం, డాన్సు తయారు చేశాం, మా ఆచార్లవారిపుణ్యాన.

సుశీ—సరే ఈమా రేదైనా మంచినాటకం వెయ్యండి. మరి మాకుసెలవా?

జానకి—[నమస్కారము చేసి] మీరు శ్రమతీసుకొని ఇంత దూరంవచ్చినందుకు వందనాలు.

సుశీ—నో మెన్షన్, నమస్తే.

[అని కుటుంబ-సూర్యా-లతో నిష్క్రమి.

[అందరు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౧౧

[సుబ్బయ్యయిల్లు. సుశీల పారిజాతము ప్రవేశింతురు.]

పారి—ఇది చూచావా ? ఏం వ్రాశుంది ?

సుశీ—షేక్స్పియర్.

పారి—ఇది.

సుశీ—సర్ వాల్టర్ స్కాట్.

పారి—ఇవంతా ఇంగ్లీషునావల్సు, ఇవి నాటకాలు, ఇది హిస్టరీ, ఇది జాగ్రఫీ, ఇది పాలిటిక్సు, ఇది ఎకనామిక్సు.

సుశీ—ఇదేమిటి ?

పారి—ఇది బుక్ ఆఫ్ నాలెడ్జి. అన్నివిషయాలు, అంటే సకలవిజ్ఞానమూ ఉంటుందన్నమాట. ఇదంతా నీకు నిమిషంలో బోధపడి నువ్వుచదివేస్తావనికాదు. ఈపేర్లుమాత్రం తెలుసుకొంటే చాలు. నలుగురుకవులపేర్లు, నాలుగుదేశాలపేర్లు, పదిపుస్తకాల పేర్లు, మామూలుగా కాలేజీకుర్రాళ్లుచ్చరించేపదాలు—సోషలిజం, కమ్యూనిజం, రష్యా, చైనా, అమెరికా, పార్లమెంటరీ గవర్నమెంటు—ఇలాంటిముక్కలు తెలుసుంటే నిజంగానే ఆవిషయాలన్నీ నీకు వచ్చనుకుంటారు. బెదిరించడానికి మార్గమిదంతా. కేటలాగుపాండిత్యం. నిజంగా మా మేష్టర్లకంతా తెలుసనా ? నోట్సులేకుండా ఉపన్యాసమివ్వమంటె బయటపడుతుంది పంతుళ్లప్రతాపం. పూర్వకాలంలా కాదు. అంతా రెఫరెన్సు చదువు. ఏవిషయం ఎక్కడుందో కేటలాగు, అంటే జాబితా, చేసుకుంటే చాలు, అందులోనే ఎంతోవుంది. నీకు తెలియనిసంగతంతా నాట్ ఇంటరెస్టెడ్, అంటే ఆవిషయాల్లో అభిరుచి లేదనెయ్యాలి. అది తప్పించుకొనేమార్గం.

సుశీ—ఏమో నాచేత నాటకమాడిస్తున్నావు. పనిఅయ్యేదాకేగా నాకీ అవస్థంతాను.

పారి—అంతేలే. ఆతర్వాత నువ్వే నాటకమాడ్తావు. లేకపోతే ఆడిస్తావు. యూనివర్సిటీలలో పెద్దపెద్ద సంస్థల్లో ప్రొఫెసర్లయింతర్వాతనే చాలామంది నిజంగా చదువుకోవడం మొదలుపెడతారు, మినిస్టరయింతర్వాత ఒకాయన జాగ్రఫీ పుస్తకం కొనుక్కొన్నాడు. గాంధీమహాత్ముడేమన్నాడు—బి. ఏ. ప్యాసయింతర్వాతనే చదువు విలువతెలిసి ఇహ అది మొదలు నిజంగా చదువుకోవడం మొదలుపెడుతారు చాలామంది—అని.

సుశీ—నాకేమో ఇదంతా మందుతాగినట్టుంది.

పారి—ఈమూడునెలల్లో ఇంతపనిచేశామా. ఇక పది హేనురోజుల్లో తేల్చేస్తాను. నువ్వూ కుటుంబరావుతో మద్రాసులో కాపురంపెట్టాలి.

సుశీ—అమ్మయ్యో, ఎంతపుణ్యమే! ఇదంతా నీదయ.

పారి—చూడు నాదెబ్బ.

పట్టుకవస్తాను నేను పట్టుకవస్తాను
కుటుంబరావును పట్టుకవస్తాను.
కుటుంబరావును కుదురుగబట్టి
మాటుగకొని చని మదరాసుకు నే॥ పట్టుక॥
అటునిటుచూచుట కవకాశములే
కెటులోకొనిపోయ్ ఏమోచేసి॥ పట్టుక॥
కుటుంబరావుకు కుటుంబమిప్పుడు
కుదురుపడునయా కొంతకొంతగా॥

ఉపాయముంటే అపాయమేదీ
ఊహాతీతము యుక్తివిధానము॥ పట్టుకవస్తాను॥

సుశీ—ఇదంతానీదయ. నాపుణ్యం పండింది.

ఎంతపుణ్యమాయె నాకు ఎంతపుణ్యమాయె
ఇన్నిదినాలూ ఇంట్లోకుమిలీ
అన్నిసౌఖ్యములు వదలిన నాకు॥ ఎంత॥
చేసినపూజలు చేసినమ్రొక్కులు
వాసిగనేడూ వరములుపడయగ॥ ఎంత॥
పారిజాతమను పేరదినీకు
పరగును సార్థక పదవినెప్పుడును॥ ఎంత॥
కోరినకోర్కులు కొదువలేకయే
వరములిచ్చెదవు పారిజాతమనీ॥ ఎంతపుణ్యమాయె॥

పారి—రాపోదాం. [అని ఇరువురు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౧౨

[కుటుంబరావు గది]

కుటుం—[ఇటునటు పచారుచేయుచు] వారమైంది, సూర్యారావు క్లబ్బుకు రావడంలేదు. పారిజాతమున్నూ రావడం మానేసింది. నాకేమీా అర్థంకావడంలేదు. టౌనులో ఎక్కడా వీళ్లపుపడరు. జాబువ్రాయడం బాగుండదు. వెంకట్రావుగారు నాకు పరిచయంలేదు. వాళ్లింటికి వెళ్లితే ఏమైనా అపార్థాలనుకుంటారు. అయినా సూర్యారావును రమ్మని వ్రాస్తాను. [అని

లెటర్ హెడ్ తీసికొని వ్రాయ నారంభించును. బిగ్గరగా] మై డియర్ సూర్యారావ్ ............

సూర్యా-[ప్రవేశించి] ఏమయ్యా, మైడియర్ కుటుంబరావ్.

కుటుం—రావోయి, నీకు నూరేళ్లోయి. అనుకుంటు న్నాను నువ్వురాలేదని. ఇదుగోచూడు నీకు జాబు మొదలు పెట్టాను, ఇంతలో నువ్వువచ్చావు.

సూర్యా—వెరిగుడ్, సంగతేమిటి ?

కుటుం—ఏమిటి వెరిగుడ్ ? సంగతి నన్నడుగుతున్నావు. నువ్వుచెప్పాలి నాసంగతి. ఏం తేల్చావు, తహతహలాడి పోతున్నాను.

సూర్యా—[నెమ్మదిగా] 'తామరమీాది నీటివలె'

[అని రాగముతీయును.

కుటుం—చెప్తావా లేదా కుదురుగా.

సూర్యా—వింటావా లేదా నెమ్మదిగా.

కుటుం—ఐతే చెప్పు.

సూర్యా-ఐతే విను. నువ్వు ధైర్యంగా ప్రపోజు చెయ్యొచ్చు.

కుటుం—ఆ. చెయ్యొచ్చా, నిజంగా? మాట్లాడావా? ఒప్పుకొందన్నమాటే. బలే, బలే. అయినా ఎంతవాడివోయి! చాలథ్యాంక్స్. ఐక్యాన్ ప్రపోజ్ [అని రెండుమూడుమార్లు చెప్పి సంతోషించును]

సూర్యా—ఒప్పుకోవడంకాదు, సందర్భం అనుకూలంగా ఉంది అన్నాను. ఐతే నువ్వుమాత్రం జాగ్రత్తగా ప్రపోజు చెయ్యాలి.

కుటుం—ఎక్కడ మీాతై చెయ్యడం? క్లబ్బులో వీల్లేదు. వీధుల్లో బాగుండదు.

సూర్యా—సాయంత్రం పార్కుకు పిలుచుకొని రానా?

కుటుం—శెబాష్, శెబాష్. ఎలా ప్రపోజుచెయ్య మంటావోయి? నాకేమో అప్పుడే సిగ్గుగాఉంది. మాటలుకూడా తబ్బిబ్బుగా వస్తున్నవోయి.

సూర్యా—ఏముందీ ? ఆమాటా ఈమాటా మాట్లాడు, కొంచెం పాలిటిక్సు, కొంచెం వెదరు, 'గాలి ఎంతచల్లగాఉంది' ఇలాంటిమాటలు అను. ఏవైనా శృంగారపద్యాలువస్తే అవీ-కొద్దిగా, ఆట్టే ఎక్కువవద్దుసుమా-ఉదాహరించు. నీ పాండిత్య మంతా చూపించు. కాస్త సందుసంపాయించుకొని తకీమని పెళ్లిచేసుకోమను. నువ్వు మహాగొప్పవాడివని ముందే చెప్పి ఉన్నానులేవోయి.

కుటుం—ఆ. ఆ. బలే. బలే. నువ్వు మహాలోకజ్ఞుడి వోయి. సైకాలజీ బలే కనిపెట్టావు బ్రదర్. రైట్. అంతే ఆమాటా ఈమాటా మాట్లాడి ప్రపోజుచేస్తాను. కాస్త దూరంలో నువ్వుండు. అంత మైగరల్ కాదులే. షీ ఈజ్ ఫ్రీ, హాహాహా.

సూర్యా—ఇంకేం, నేనువెళ్లి, సాయంత్రం ఇద్దరం క్లబ్బుకువస్తాం. అక్కడినుంచి మనం ముగ్గురం పార్కుకువెళ్దాం.

కుటుం—చాలాథ్యాంక్స్, చాలాథ్యాంక్స్.

[ఇద్దరు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౧౩

పార్కులో ఒకచెట్టుక్రింద బెంచి.

[సూర్యారావు, కుటుంబరావు, సుశీల ప్రవేశింతురు]

సూర్యా—బలే బాగుందోయి ఆలెక్చరు. ఏమైనా పంచపాళి లోకేశయ్యరు మంచి హ్యూమరస్ స్పీకరు.

సుశీ—మంచి పొలిటీషియనండీ.

కుటుం—ఎంత పాలిష్డు ఫెలో. ఎంత మర్యాదనుకున్నారు. మునుపు రైటానరబుల్ శాస్త్రి మాట్లాడేవాడు ఇలాగే.

సుశీ—ఆయన మాట్లాడితే అలాగే నోట్సు తీసుకొని అచ్చెయ్యొచ్చండీ. యూ నో మిస్టర్ ఎస్. శ్రీనివాసయ్యంగార్, కాంగ్రెస్ ప్రెసిడెంట్. ఎంత ఫైన్ స్పీకరు. ఏమైనా మన సి. ఆర్. రెడ్డిగారి హ్యూమరు రాదండీ. మన పీ. పీ. అయ్యరూ ఇంతే. చాలా వేడుకగా మాట్లాడుతారు.

కుటుం—అవునవును. మీది పాలిటిక్సుగా. మీ నాలెడ్జి అప్పుడేటుగా ఉంటుంది. నాకు హిస్టరీఅన్నా తేదీలన్నా అసహ్యం.

సుశీ—అర్థంలేని అసహ్యమండీ. తెలిస్తే సహ్యమే. కాస్త డీప్‌గాచదివితే హిస్టరీ చాలా ఈజీ అండీ. సులభంగా జ్ఞాపకముండేది. అందరికీ కావలసింది చరిత్ర. మన నావల్సుకు డ్రామాలకూ మూలం అదేగదండీ.

కుటుం—అసే సూరీ, మరిచిపోయినాను, మనం ఒకడ్రామా అయినా వెయ్యలేదే ఈ సీజనుకు.

సూర్యా—వేదాం, ఏంవేదామంటావు.

కుటుం—కన్యాశుల్కం వేదామోయి. అదైతే సులభం, ఎలాచేసినా చెడకుండా రక్తికడుతుంది. మనంచెడిపినా ఎవడూ దుఃఖపడడు.

సూర్యా—నువ్వు గిరీశం వేస్తావా ?

కుటుం—వేస్తాను. తలిమ్మా వేషాలుచూచి సంపాయించు. మధురవాణీ బుచ్చమ్మా కావాలి. చూదాం, లెటస్ ట్రై.

సూర్యా—నువ్వు గిరీశంవెయ్యగలవు బాగా. నీకు లవ్ అంటే ఏమో తెలుసు.

కుటుం—నాకా? వాడ్డాయూమీన్. నాకెలా తెలుస్తుందోయి, లవ్ అంటే ఏమిటి, ఎలా ఆక్టుచెయ్యాలి-అని.

సూర్యా—ఇదంతా అనుభవంమీాద చెయ్యాలి.

కుటుం—అనుభవంకాదూ, ఏమీాకాదు, ఆక్షనంతా ఇమాజినేషనే.

సుశీ—[కుటుంబరావుతో] మీాకు లవ్వంటే తెలియక పోవడ మేమిటండీ. క్షమించండి. స్వతంత్రంగా అడుగుతున్నాను, మీాకు మ్యారేజైందిగా, యు ఆర్ ఎ ఫామిలీమ్యాన్.

కుటుం—ఎందుకులెండి నా ఫామిలీగోడవ. నేనొక భగ్న హృదయుణ్ణి.

సూర్యా—[తనలో] శ్రుతిమించి రాగంలో పడుతూ ఉంది. ఇక నేనువెళ్తాను. [ప్రకాశము] ఇద్గో కుటుంబ్ చూాడు నాపార్కరు పెన్ను క్లబ్బులో మరిచొచ్చానోయి. ఇద్గో ఇప్పుడె పొయ్యొస్తా. మాట్లాడుతూఉండండి. ఒక్ మినిట్.

[అని త్వరగా నిష్క్రమించును.

సుశీ—ఎందుకండీ అంత ఆయాసపడతారు.

కుటుం—[చింతతో] నిజంగా నేనొక భగ్నహృదయుణ్ణి. నా లైఫంతా ఎట్లెట్లాగో పోయింది. నాది చాలా అర్లీ మ్యారేజండి. నాకే చెప్పుకోవడానికి సిగ్గుగాఉంది. నా పన్నెండోసంవత్సరంలో నాకు పెళ్లైంది. మీకు తెలిసేఉంటుంది. బహుశా మీరు ఆమ్యారేజికి వచ్చారేమో.

సుశీ—నాతో ఆడుకొన్న దేగాపాపం సుశీల, వచ్చాను. అయితే ఆవెంటనే వైజాగ్ వెళ్లిపోయారు మీరు, నేను మద్రాసువెళ్లాను. మళ్లీ ఈరావడమే. అంచేత మధ్యసంగతంతా ఇక్కడ వినడమేగాని నాకు ప్రత్యక్షంగా తెలీదు.

కుటుం—తర్వాత చాలాగొడవైపోయింది. ఆతర్వాత వాళ్లకూ మాకూ సంబంధం లేకుండపోయింది. ఉప్పూనిప్పూ అయిపోయినాం. మా ఫాదర్ చాలానొచ్చుకొని మళ్లీ వాళ్ల ముఖం చూడొద్దన్నాడు. మోరోవర్ వాళ్లు చాలా ఓల్డు ఫ్యాషన్. నాకు చాలా అప్పుడేటుగా ఉండాలి.

సుశీ—నిజమేనండీ. లైఫ్ ఎవళ్లకీ చక్కగా వెళ్లదనుకొండి. నాకుమాత్రం మీరన్నా ఆ అమ్మాయన్నా చాలా జాలిగా ఉంటుందండి. మీరు మీవైపును పిలిపించుకోకపోవడం మాత్రం బాగులేదండి.

కుటుం—మీకు పెర్సనల్ఫ్రెండు కాబట్టి అలాఅంటారు. ఎబ్బే. ఆమాట చెవిలో వేసోకూడదనుకున్నాను. మీ మీ ఢండ్రే రిగార్డువల్ల ఈవిషయం ఇంతదూరం చర్చిస్తున్నాను.

ఎందుకులెండి ఆ మొరటుస్వరూపం. ఎజుకేషనూలేదు ఏమీ లేదు. అప్పుడేటు మ్యానర్సు ఒకటీరావు. చాలాబ్యాక్వర్డు. మే మెలా సంసారంచేస్తాం.

సుశీ—నాఫ్రెండుకోసం మాట్లాడుతున్నా ననుకోకండి. మీ రేమైనా మళ్లీ కనుక్కున్నారా ? మీతండ్రిగారికోపం మీరుకూడా సాధించదలచారేగాని ఆ అమ్మాయిని పిలిపించు కోవడానికి లవలేశమైనా ప్రయత్నించారా?

కుటుం—నో, నో. చెప్పొద్దూ, లేదు. వాళ్లేవచ్చి పంపిస్తామంటున్నారుగాని ఆ పాత కుటుంబకలహాలు వగైరాలే కాకుండా, వాళ్లు చాలా పూర్వాచారంగా ఉంటారు. అందు వల్ల నేను పూర్తిగా నిరాకరించాను.

సుశీ—అంతేకదా. మళ్లీ మీవైపును ఒకమాటు కంటితో నైనా చూచారా ? చూడ్డానికైనా ప్రయత్నించారా ?

కుటుం—లేదు. నాకు అటు మనసులేదుగా.

సుశీ—మీకు ఎజుకేషను కావలిసొస్తే చేయించుకో వచ్చునుగా. నేను సహాయంచేస్తాను.

కుంటు—రాదండి. ఇప్పుడు రాదు. ఇకమీద వస్తుం దండీ. దానికి వాళ్లనాన్న ఒప్పుకోడుకూడా. చదివించేరకమైతే ఈపాటికి ఈపన్నెండేళ్లలో ఎంత చదివించుండొచ్చు.

సుశీ—నిజమే మీరనేది. ఐతే అంతదూరం బహుశా తోచలేదు. పైగా మీవ్యాసు తెలియందే ఏంజేస్తారు. మీరు చదువు పూర్తైవస్తే మిమ్మల్ని ప్రార్థించి మీదగ్గర ఆ అమ్మా

యిని వదిలెయ్యొచ్చని అనుకున్నారు. ఇప్పు డొప్పుకుంటారను కుంటాను. మీవిషయం నేను వాళ్లతో మాట్లాడనా ?

కుటుం—నో నో, వద్దండీ. నాకు అక్కడ మనస్సుంటేగా.

సుశీ—సుశీల ఫేర్ గా ఉందండి. నాలాగేఉంట్సిది చాలా వరకు. దూరంలోనుంచిచూస్తే నేనే నని అనుకుంటారు. వాళ్ల నాన్నే మోసపోతే.

కుటుం—నాకు నమ్మకంలేదు. మీరెక్కడ అదెక్కడండీ! హస్తిమశకాంతరం. ఈ ఎజుకేషనూ ఈపాలిష్షు, స్టైలు నాలెడ్జి, ఎక్సైటెమెంటు వస్తాయా? అకెడెమిక్ క్వాలిఫికేషను ఎక్స్పిరియన్సు వీటితోసమానమా ?

సుశీ—పాపం, ఆ అమ్మాయి, అమాయకురాలండీ, మీ కోసం ఎలా తపించిపోతూందో మీరెరుగుదురా ?

కుటుం—ఐ డోంట్ కేర్. నాతప్పులేదు. వాళ్లనాన్న తప్పు. ఇంకా మానాన్నతప్పుకూడా. నాదీకాదు. ఆ అమ్మాయిదీ కాదనుకోండి. వేరేవివాహం చేసుకోనీండి.

సుశీ—హరిహరీ! ఎంతమాటన్నారు. హిందూస్త్రీ అలా చేస్తుందండి, అందులో మీసుశీల. కుళ్లి చచ్చిపోతుందిగాని, నో నో. మీరు అలా అనడం ధర్మంకాదు. ఇది హిందువులకు బాగులేదు.

కుటుం—[సిగ్గుతో] సారీ, అయాంసారీ. ఇంకేమీలేదు. అవిడ యిష్టంలోకి వదిలేశాను. ఐతే అడుగుతాను, ఇదంతా సంఘంయొక్క తప్పుకాదండీ, ఫైల్డుమ్యారేజి ? నాకుగాని ఆ

అమ్మాయికిగాని ఏమైనా తెలిసి మేము వివాహంచేసుకున్నామా? బొమ్మలపెళ్లికీ దానికీ ఏమైనాభేదముందా? మీరుచెప్పండి. న్యాయంచెప్పండి. ఇప్పుడు నాకు బుద్ధివచ్చింది. నా కిష్టంలేదు. దానికి నేనేంచెయ్యను.

సుశీ—న్యాయమే, మీమాటంతా న్యాయమనే అని పిస్తుంది. అయితే సంఘాన్ని ఇప్పుడు మనమెలా దిద్దగలమండి? మీరుదిద్దగలరా? మితిమీరి మీరు వివాహంచేసుకొన్న భార్యను వదిలేయగలరు; ఆవిడ జీవితం ధ్వంసంచేయగలరు. అంతేగాని మీచర్యవల్ల ఏపురోహితుడికన్నా, ఏసనాతనుడికన్నా బుద్ధొచ్చి లోకం ఏమైనా మారగలదేమో ఆలోచించండి. మనలాంటి సంఘసంస్కర్తలు ఎందరురాలేదు. ఎందరుపోలేదు. 'వారేరీ? భూమిపై పేరైనఁగలదే!' మీరనుకొనే దురాచారాలు ఏమైనాపోయినవా? ఎవరిదారి వాళ్లది. లోకాన్ని బాగుపర చడం అయ్యేపనికాదు. మీపద్ధతివల్ల మరేఫలితం నాకు కనబడ లేదుగాని ఒకటిమాత్రం కనబడుతున్నది. సభార్య ఆ అమ్మాయి దుఃఖం. అది తప్పదు.

కుటుం—నేను జావాబ్దారీకానండి. అదికర్మ.

సుశీ—ఆడవాళ్లకు వర్తించేకర్మ మొగాళ్లకులేదాండి. వివాహమాడి వదిలేస్తే ఆ అమ్మాయిజీవితం పాడయిపోవడం ఆవిడకు కర్మైతే, వివాహమాడినభార్య ఎలాంటిదైనా దానితోటే కాలక్షేపం చేయవలసిఉండడం మీకూకర్మేగా.

కుటుం-[ఆశ్చర్యపడి ఒకక్షణముండి] మీ ఫ్రెండు కాబట్టి వకాల్తు తీసుకున్న వకీలుకంటే ఎక్కువగా మీరు మాట్లాడు

తున్నారు. క్షమించండి. ఆ అమ్మాయిని ఇక ఎంతమాత్రం దగ్గర చేర్చ దలచుకోలేదు. ఆవీధివైపే వెళ్లను. అటు కన్నెత్తిచూడను.

సుశీ—సరే అంత పట్టుదలైతే పోనీండి. దటీజాల్ రైట్. అయితేమాత్రం అయ్యోపాప మనిపిస్తున్నది.

కుటుం—నన్నుచూస్తేనా, వెల్ వెల్. లైఫ్‌లో ఒక కంపానియన్ లేకపోతే ఎంత దుర్భరమండీ జీవితం, మిస్ పారిజాతం. నావ్యాసు మేరుచేస్తూ నాతో సింపతైజుచేస్తూ నామనస్సుకు నెమ్మది కలగజేసే కంపానియన్ కావాలండి. నాకూ కాస్త ఆస్తి ఉంది, పెద్దలది. చాలా అయిడియాస్ కలవాణ్ణిగాని పట్టిచవటను గాను. నాకు జీవితంలో పెద్దకోరిక ఏమిటంటే ఒక ఎజుకేటెడ్ లేడీ, అలాంటిదాన్ని మ్యారేజి చేసుకొంటే అద్భుతాలు చేయగలను నిజంగా.

సుశీ—నిజంగా.

కుటుం—ఓ నిస్సందేహంగా. [మెల్లగా] ఇప్పటికి నేను పవిత్రజీవితం గడిపినవాణ్ణండి. చాలా ప్యూరుగాఉన్నాను.

సుశీ—తెలుస్తూఉందండి. మీరుచెప్పాలా, సందేహమా.

కుటుం—నాకెవరూ గరల్సు నచ్చలేదండి. మంచివాళ్లకోసం చూస్తూఉన్నాను. మీరేమీ అనుకోకుండా ఉండేపక్షంలో ఒకవిషయం చెప్పదలచుకొన్నాను.

సుశీ—చెప్పండి, ధారాళంగాచెప్పండి. ఎందుకింత ఉపోద్ఘాతం?

కుటుం—ఆ. ఆ. చెప్పమంటారా, మీరు, మీరు నన్ను పెళ్లిచేసుకొంటారా?

సుశీ—నేనా? మిస్టర్లా? [అని ఆశ్చర్యము నభినయించి లేచి నిలుచును.

కుటుం—అవును. [ప్రార్థనగా] నన్ను పెళ్లిచేసుకో పారిజాతం. నిజ్జంగా నీకోసం ఎంత తపిస్తున్నానో నీకుతెలియదు. ఐ వార్షిప్యూ. నిన్ను పువ్వుల్లోపెట్టి పూజచేస్తాను. ఆదినం క్లబ్బులో నిన్నుచూచింది మొదలు నేను నీవశమైపోయినాను. నాస్త్రైకాలజీ నీకుతెలీదు. లవ్ ఈజ్ బ్లైండ్, లవ్ అట్ ఫస్ట్ సైట్. నీదే నాలోకం. ఇదుగో నీకర్చీఫు, ఆరోజునుంచి నాహృదయంలోనేఉంది. నీవే నాదేవతవు. నాయిల్లు నాజీవితం అంతా నీవల్ల పవిత్రంకావాలి. నన్నుకాపాడు. నువ్వే నాపాలిటి దేవపారిజాతానివి.

సుశీ—[బదులుచెప్పక తలవంచుకొనియుండును.]

కుటుం—ఓ మైడియర్, ఆన్సర్మి. బదులుచెప్పు, నీకిష్టముందా లేదా?

సుశీ—చాలా అధర్మమండీ. నా స్నేహితురాలికి నేను అధర్మం చెయ్యలేను.

కుటుం—అధర్మం ఎంతమాత్రంకాదు. నాలో తప్పులేదన్నానే. ఆమాట నువ్వు ఒప్పుకున్నావే పారిజాతం.

సుశీ—సరే, అధర్మమే చేస్తాననుకోండి మీకోసం, మళ్లీ నాస్నేహితురాలికి మొహంచూపగలనా? పాపం ఆపెద్దమనిషి, మీమామగారు నేను మంచిదాన్నని అనుకొనేవారు, నన్ను ఇకమీద ఏమనుకొంటారు. వీళ్లనంతా నయవంచన చేసినట్టౌ

తుందిగదా. అంతటితో పోతుందా? ఊళ్ళోవాళ్లు పెద్దమనుష్యు లేమనుకొంటారు. నలుగురిలో తలయెత్తుకొని తిరగగలనా? మళ్లీ క్లబ్బులో కాలుపెట్టగలనా? నాగౌరవమంతా మట్టిపాలే గదా? చదువుకొన్న ఆడవాళ్లు ఇలాగే అని నిందపాలుకానా? ఈవిషయాలంతా మీరు ఆలోచించారా?

కుటుం—[స్తబ్ధుఁడై చూచుచుండును.]

సుశీ—చూచారా? మీరాలోచించలేదు. మీలో అంత రాత్మ చావలేదు. అధర్మానికి భయపడుతున్నారు. చెయ్యకండి, అధర్మంచెయ్యకండి. నాతోరండి. మీభార్యను మిమ్మల్ని కలుపు తాను. దేవుడు మెచ్చుకొంటాడు.

కుటుం-[ఆశ్చర్యముతో] నిజమే, నీహితోపదేశం నిజమే. నీవు నే ననుకొన్నదానికంటెకూడా చాలా ఉత్తమురాలివి. నీలో ఇన్నిసుగుణాలున్నవని గ్రహించలేకపోయినాను. నీ మాటలువినే కొద్దీ నాకు నీమీదగౌరవం ఎక్కువవుతూవుంది. నీవంటి సుగుణరత్నాన్ని సంపాయించుకోవడానికి నేను ఏపాప మన్నా చేస్తాను. ఎంత అధర్మమన్నా చేస్తాను. నాభార్యతో నాకు స్నేహమేలేదు, పరిచయమేలేదు. నీవెంతచెప్పినా అటువైపు నామనస్సు తిరగదు. నీవే నాదేవతవు. ఏమైనాసరే. నాప్రార్థన కాలితో తన్నేస్తావా, నేను రేపు మృతకళేబరంగా ఈపార్కు లో ఇక్కడనే పడుంటాను. ముమ్మాటికి నిజం. నీవన్నకష్టాలకా మనం పారిపోదాం. ఈ ఊరేవద్దు. మదరాసులో ఎక్కడనో మారుమూలలలో చేరుదాం. ఆమహాసముద్రంలో ఎవడు మనల్ని

కనుక్కోనేవాడు? ఆలోచించు, కనికరించు; నీలోతప్పులేదు. నాదేతప్పు. నీవు ఒప్పుకొని బయలుదేరి నాతోరావడంకూడా నాతప్పే. అయితే నాకుమాత్రం నీవుకావాలి.

సుశీ—సరేనండీ. మీరు ఇంతదూరం వేడుకొంటూంటే సమ్మతిస్తాను. ఎందుచేతంటే మీరుచెయ్యడం అధర్మమని మీరే ఒప్పుకొంటున్నారు కాబట్టి. తమ అధర్మాన్ని ఒప్పుకోవడమే సగం మార్గానికి రావడం. మీభార్య మీదగ్గరికివచ్చి మీరు ఆవిడను గ్రహించేపద్ధతికే నేను మార్గంచూస్తాను. నాస్నేహితు రాలికోసం త్యాగంచేస్తున్నాను. మీరిద్దరు ఒకటి కావటాని కోసమే నేను మిమ్మల్ని వివాహంచేసుకుంటాను. మీరు ఒక కుటుంబం అయిన మరునిమిషం పారిజాతం మిమ్మల్ని వదలి ఆశ్రమ స్వీకారంచేస్తుంది. ఈ ఏర్పాటు మీకిష్టమైతే ఒప్పుకుంటాను. లేకపోతే మీదోవమీది నాదోవనాది.

కుటుం—ఓహో, ఎంతగొప్పమనస్సు నీది! ఇదుగో నీకోసం నేను ప్రమాణంచేస్తున్నాను. నీవు గీచిన గిరిదాటను.

సుశీ—సివిల్‌మ్యారేజికి అరేంజిచేయించండి, రెజిస్ట్రార్ ఆఫీసులో.

కుటుం—తప్పకుండా. మనం మద్రాసుకువెళ్దాం. మన సూర్యారావును సెక్రటరీ జానకిరామయ్యను సాక్ష్యానికి పిలుచు కొనివెళ్దాం. అంతా చాలారహస్యంగా చేదాం.

సుశీ—సరేనండీ. అయితే నాది అధర్మంకాదు.

కుటుం—నాదీ అధర్మంకాదులే. ఇంకెందుకామాటలు, రావెళ్దాం, మైడియర్.

సూర్యా—[ప్రవేశించి] ఏమయ్యోవ్, ఏమిటి మైడియ రంటున్నావు ?

కుటుం—ఆ వచ్చావా ? ఏంలేదు. మైడియర్ సూర్యా రావు ఇంకారాలేదే అనబోతూఉంటే నువ్వు వచ్చావు.

సూర్యా—అంతేగదా. సరే. ఇంకేం. వెళ్దాం చాలా ప్రొద్దైంది. [అందఱు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౧౪

[సుబ్బయ్యగారియిల్లు. సుబ్బయ్య, ప్రయాణసన్నాహంలో సుశీల, సూర్యారావు, పారిజాతం, అందఱను పరకాయించి చూచుచు రామయ్య ప్రవేశింతురు.]

సుబ్బ—అమ్మాయి జాగ్రత్తగావెళ్లు. నీవు అతనిదగ్గిర ఎలాఉండాలో ఏమిటో అదంతా ఆ మహానుభావురాలు పారి జాతమే నీకు చెప్తుంది. నేను నీకేం చెప్పగలను. అందరూ బాహాటంగా కోమార్తెలను కాపరాలకుపంపిస్తూ ఉంటే నేను మాత్రం దొంగలాగ పంపించవలసుంది.

పారి—ఎందుకు మామయ్యా అలాఅనుకుంటారు. మనం ఇంకా నాటకం మధ్యలోనేగా ఉన్నాం. ఇంకా నాలుగుసీను లున్నాయి. నాటకం పూర్తిఐపోతే బాహాటంగానే అల్లుడూ కూతురూ మీయింటికి వస్తూపోతూ ఉంటారు.

సుబ్బ—అదంతా నీ పుణ్యం. సూర్యారావుకూడా వెళ్తున్నాడా ?

సూర్యా—మీ అల్లుడిగారి ఏర్పాటుప్రకారం నేనూ మాక్లబ్బు సెక్రటరీ జానకిరామయ్యా, ఇద్దరంవెళ్తున్నాం.

రామయ్య—[ఒకమూటకట్టి, హోల్డాలు బిగించి] హుం. ఇక గట్టిగా ఉంటుంది. [నవ్వుచు] మనది గట్టి బంధం. వదల్దు.

సూర్యా—బహుశా మనసంబంధం ఒక ప్రబంధం.

పారి—పారిజాతాపహరణప్రబంధం, అయితే నవీనం.

రామ—సుశీలమ్మా, మాకు ముసలాళ్లకు జాబులు వ్రాయిస్తుండవమ్మా.

సుశీ—అలాగే నండి. ఎప్పటికప్పుడు మీకు తెలుస్తూ ఉంటుంది లెండి. [అని పారిజాతమును చూచును.]

సుబ్బ—మరి అక్కడ సుశీలకి చెప్తూ కథ నడిపించేదానికి సూత్రధారిణివి నువ్వు లేకపోతే ఎలాగమ్మా పారిజాతం.

రామ—ఎందుకూ? ఒక తురకబీబీని అప్పుడే తయారు చేయించింది మన పారిజాతం.

సుబ్బ—ఎక్కడా?

పారి—ఇదుగో ఇందులో ఉంది తురకబీబీ. నాపేరు ఖడీజాబీబీ ఇప్పటినుంచి [అని తనబురఖాను చూపును] ఆ కథంతా తర్వాత చెప్తాను లెండి. సూర్యారావు, సుశీ, మీరుబయలుదేరండి. టయిమైంది. వాళ్లు స్టేషనువద్ద ఉంటారు మీకోసం చూస్తూ.

సుశీ—నాన్నా వెళ్లొస్తాను. [అని కన్నీళ్లువిడుచును.

సుబ్బ—ఏం అనుకోకమ్మా, పోయిరా. ధైర్యంగా ఇంత దూరం పనిజరిపావు. ఎందుకు కన్నీళ్లు. త్వరలో మేం వస్తాంలే.

రామ—ఏమైందని నీధైర్యం అంతా. ఏమైనా తండ్రికూతురూను. ఎంత ధైర్యంగాఉన్నా ఎడబాపు దుఃఖకరంగానే ఉంటుంది. సరే కానీ, పదపద. దొడ్డిదారిని పారిజాతం ఇంటికి వెళ్లి అక్కణ్ణించి వెళ్లాలి.

సుశీల—వెళ్లొస్తాను మామయ్యా.

రామ—శుభం. శుభం. వెళ్లిరావమ్మా.

[సుశీల సూర్యారావులు నిష్క్రమింతురు.

పారి—[రైలుచెంబుచూచి] ఇదుగో రైలుచెంబు మరిచావు సుశీ.

[అని యిచ్చును. సుశీల వచ్చి తీసికొని మరల నిష్క్రమించును]

సుబ్బ—[నెమ్మదిగా] అబ్బ! రామయ్యగారూ, శకుంతలను కాపరానికి పంపిన కణ్వమహర్షి అన్నట్లు ఇప్పుడు నామనస్సు నెమ్మదిస్తూఉంది.

రామ—అంతా వేళరావాలండి, వేళరావాలి. ఇదంతా భగవంతుడి చిద్విలాసం. ఇహ ఇక్కడనుంచి మీ అమ్మాయిది యోగజాతకం నేనంటున్నానుగా, నామాట తప్పదు. నాలో ఉండే గొప్పతనమే అది. [అందరు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౧౬

[సెంట్రలుస్టేషను వాకిట]

[నేపథ్యమునుండి రైళ్లకూతలు, మోటారుకారుల శబ్దములు వినఁబడుచుండును. కుటుంబరావు, సూర్యారావు, సుశీల వారివెనుక బురఖాలో పారిజాతము ప్రవేశింతురు]

సూర్యా—ఎక్కడికి పోదాం కుటుంబ్.

కుటుం—నువ్వే అరేంజి చెయ్యి.

సూర్యా—ఆంధ్రాహోటల్ త్యాగరాయనగర్. చూచి వస్తాను టాక్సీని. [అని నిష్క్రమించును.

కుటుం—పారూ ఈతురకమ్మాయి సంగతేమిటి?

సుశీ—మనతోకూడానే పిలుచుకొనిపోవాలి. వాళ్ల వాళ్లు స్టేషనుకు వస్తారనుకుంటే రాలేదు. మనం కూడాపిలుచు కొనివెళ్దాం. అక్కడినుంచి కెమల్‌పాషా బిల్డింగుకు ఫోను చేస్తే వాళ్లన్నయ్య వచ్చి పిలుచుకొని వెళ్తాడు. రైలులో కలిసినా ఈ ఆరుగంటల్లో చాలా స్నేహమై పోయిందండీ. కాస్త చదువు కొన్నది కూడా. ఇంటను ప్రవేశించి ఘూనేసిందట. భోజనం పెట్టించి తర్వాత పంపిద్దాం.

కుటుం—వెరిగుడ్. ఇంక అంతా నీయిష్టం. నీవు ఏంచెయ్య మంటే అదంతా చేస్తాను. అయాం యువర్ సర్వెంట్.

[పారిజాతం సుశీలను గిల్లును]

సూర్యారావు-[ప్రవేశించి] టాక్సీ రెడీ. పోయి అందులో కూర్చోండి ఆడవాళ్లు ముందు.

[సుశీల పారిజాతం నిష్క్రమింతురు.

సూర్యా—జానకిరాం, రా. ఏయి కూలీ తీసుకరా సామానులు.

[కూలివాడు వానితో జానకిరామయ్య ప్రవేశింతురు]

కూలి—శామీ నిండా బళువు.

సూర్యా—సరే లేవోయి.

కూలి—[పోయి మరల కొన్ని సామానులు తెచ్చి] ఎన్నా బళువుడా అప్పా పాణబళువాయిరకుడు. [అని మరలపోయి కొన్ని సామానులు తెచ్చి] అంతా సూడండి సామీ, ఎంచి లెక్క సూడండి. తర్వాత ఏమయినా పోయింది అని చప్తే నేను జవాబ్దారీ లేదండీ. అః ఆః.

కుటుం—అన్నీ తెచ్చావా? ఒకటి రెండు మూడు నాలుగు ఐదు ఆఱు ఏడు ఎనిమిది తొమ్మిది, ఇంకొకటేదీ. గొడుగు. ఆ, పారూ దగ్గరుంది.

కూలి—ఒకటి పోదుశామీ. సామానులు టాక్సీలో పెడుతునా? టూ రుపీస్ పైన వేశియియ్యండి సామీ, టాక్సీలో మోసికొని పోయిపెడ్తాను.

కుటుం—ఎందుకూ ఈవరవంతకు రూపాయలమీద రూపాయ లడుగుతున్నావు. ఎంత తినాలని నీ ఆశ ?

కూలి—నేను కూలివాడుశామీ. కష్టంచేస్తానుశామీ. మీరు దొరలుశామీ. కడుపులో కొట్టవద్దుశామీ, వీపుమీద కొట్టుశామీ. మీరుఇస్తే దానే మేంతినాల. మీరు ఆంధ్రవాళ్లు శామీ, నిండాదారాళం, నిండాదారాళం.

కుటుం—అవులేవోయి. మీ పనివచ్చినప్పుడు పొగడ్డం, ఆతర్వాత తిట్టడం. అబ్బితే శిగ, అబ్బకపోతే కాళ్లు, నేనూఎరుగుదు నిదంతా.

కూలి—శామీ, రండ రండ పోతాము.

కుటుం—ఎవఁడ్రా రండ. నీఅబ్బరండ, నీతాతరండ, నీవు వెధవముండ. రండఅంటావు రోగ్.

[అని వానిగొంతు పట్టుకొనును.

కూలి—లేదుశామీ, లేదుశామీ. బుద్ధిబుద్ధి. అయ్యయ్యో, అట్లా కోపంచేస్తావే. నేను నిండా మర్యాదగా చెప్తే నువ్వు కోపంచేస్తావే. రండ అంటే తప్పాశామి. అయ్యో కడవుళే. ఇదు ఎన్నాడా ఇదు. నల్లత్తుకు కాలమిల్లేడా కడవుళే కాలమిల్లే.

సూర్యా—మరి రండఅంటే ఏమనుకొన్నావోయి ?

కూలి—అయ్యయ్యో, నాకు తెలీదు మగరాజా, నాకు సదువు తెలీదు. ఇక్కడంతా రండఅంటే మర్యాదశామీ.

జానకి—అంతేలే, ఇక్కడ రండలకే మర్యాద.

కూలి—అవును శామీ. వాళ్లకి ఒక రోడ్డు కూడా ఉండాది. రండాల్ రోడ్డు అంటారు శామీ. రండి పందులుగారు, టాక్సీవస్తాది.

సూర్యా—మళ్లీ పందులంటావేం ? మేం పందులమైతే నువ్వేమౌతావ్.

కూలి—అయ్యో మురుగనే. ఆండవనే యారు మూం జిలే ముళిచ్చిండా శివా. నాకు ఇదంతా తెలీదు భగవంతుడా.

సూర్యా—సరే టాక్సీలో పెట్టు ఏదోయిస్తాం.

[కూలివాడు పెట్టును.

సూర్యా—నేను ట్రాములోనో బస్సులోనో వస్తాను. మీరు టాక్సీలో వెళ్లండి. నేను ఆ అమ్మాయి బ్రదరుకు ఫోను చేసి వస్తాను.

కుటుం—సరే, త్వరగా రా, మేం వెయిటు చేస్తుంటాము.

[జానకీరామయ్య కుటుంబరావులు నిష్క్రమింతురు.
లోపల కారుపోయిన శబ్దమగును.

సూర్యా—ఇదుగోనోయి ఐదురూపాయలు.

[అని కూలివాని కిచ్చును.

కూలి—అన్యాయం శామీ అన్యాయం. బీదవాడి మీద అన్యాయంవద్దు శామీ. అంత సామాను, నలుగురు మోశే సామాను బండిలో పెట్టివిడిస్తినే. మంచిటాక్సి కూశి ఆ అయ్య వాళ్లను ఆ అమ్మలని కూకోపెడితినే శామీ. ఎంతబళువు! ఎంత బళువు!

సూర్యా—ఎవర్రా బళువు, అయ్యవాళ్లను అమ్మవాళ్లనూ నువ్వు మోశావా? వాళ్లాబళువు?

కూలి—అడకడవ్వళే. లేదుశామీ. సామాను బళువం టానుశామీ. సామాను సామాను సామాను. నిండా కోపం చేస్తావే. ఆండవనే ఎన్నా పొళప్పుడా ఇదు కూలికారర్ పొళపు.

సూర్యా—టాక్సీ నేను మాట్లాడితే నువ్వు మాట్లాడిన ట్లుంటావే.

కూలి—లేదుశామీ. ఈశామీ, నాదుడ్డు ఈశామీ. పడిబియ్యం ఒకరూపాయి ఎనిమిదణాలు శామీ. నాకు రెండు పెళ్లాలు శామీ. ధర్మరాజా, ఐదుమందులు బిడ్డలు.

సూర్యా—ఇదుగో ఒకరూపాయప్పైన.

కూలి— పెట్టుకోశామీ, నువ్వేపెట్టుకో, మగరాజుగా పెట్టుకో. ఈరూపాయకి మిద్దెయిల్లుకట్టి విడుస్తువ వలెవుంది.

సూర్యా—నీవెక్కడి దయ్యానివిరా. ఆరంభమైంది చెన్నపట్నం తమాషా, ఇంకో రూపాయి. పో ఇకమాట్టాడకు

[అని ఇచ్చి నిష్క్రమించును.

కూలి—నిండా ఇచ్చేశినావు, పోయ్యా. డేయి మురిగేశా నల్లకూలిడా ఇన్నికి. పెరియ పైత్యకారనుంగో వందాంగో

[అని మరియొకమార్గమున నిష్క్రమించును.

---

## దృశ్యము ౧౬

[మదరాసులో చింతాద్రిపేట. కుటుంబరావుగది. ఒకపిల్లవాఁడు కూర్చుండి ఏవోకాగితములు కత్తిరించుచుండును. కుటుంబ రావును సుశీలయు మాటలాడుచు ప్రవేశింతురు]

కుటుం—మరైతే పారూ. నువ్వెందుకు రెజిస్ట్రారాఫీసులో పేరు మార్చుకొని సుశీల అనిప్రాయించావు? నాకర్థంకాకుండా ఉంది.

సుశీల—[బల్లమీఁద టేబిలుక్లాతు పరచుచు] చాలా కారణాలవల్ల ఆపనిచేశాను. నేను మీతోరావడం, మనమ్యారేజి ఇదంతా మానాన్నకు తెలీదుగా, ఆయనవెతుక్కొని పోలీసు కంప్లయింటిస్తే దొరక్కుండా ఉండడానికిన్నీ, మీ మామగారు ఏమైనా పుకార్లుపుట్టిస్తే అవికావని అనిపించి వాళ్లుకనుక్కోవడానికి ముందే పారిపోవడానికిన్ని. చాలా ఊహతోపనిచేశాను.

మొత్తంమీద మీకుకావలసింది నేనుగాని నాపేరుకాదుగా. నేనంతా జాగ్రతగా పనిచేస్తానులెండి.

కుటుం—దటీజాల్ రైట్, నీవేంజేసినా సరిగానే ఉంటుంది. ఈయిల్లు, ఈచింతాద్రిపేట, ఇదంతా నీకు ఇష్టంగానే ఉందా ?

సుశీ—చాలాబాగుందండి. నాకు రోజూ ఒక చోటికి మీతో వెళ్తూఉండాలని ఉంది.

కుటుం—వెళ్దాం, తప్పకుండావెళ్దాం. ఈ మద్రాసులో ఏబస్సు ఎక్కడికి వెళ్తుందో కనుక్కోవడం పెద్దకష్టం.

సుశీ—నాకు తెలుసుగా. నేను చదివింది ఇక్కడే. అయితే ఈ సందుగొందు లెరగను లెండి. మనతో రైలులో వచ్చిందే తురకమ్మాయి, ఆమెకూడా కాన్వెంటులో చదివిందట. నా ఫ్రెండ్సందరూ ఆమెకుకూడా తెలిసున్నారు. ఆమెకూడా నాదగ్గిరికి తరు చొస్తూ ఉంటుంది. నాకేమీ కొత్తగాలేదండీ. హాయిగానే ఉంది.

కుటుం—నాకోఆశ్చర్యం! నువ్వు ఇంత ఎజుకేషనున్నా అలవాటున్నదానిలాగ వంట బహుబాగా చేస్తున్నావే.

సుశీ—ఏండుందండీ. ఊహఉంటే ఏపనైనా చెయ్యొచ్చు. వాడెవడో సాలెవాడు కవిత్వంచేసి భోజరాజుతో అన్నాట్ట. 'కవయామి, వయామి, యామి' అని. అంటే కవిత్వం చేస్తాను, నేతనేస్తాను, ఇంకవెళ్తాను. అని. ప్రకృతిసహజంగా వంటస్త్రీ విద్య. విద్యలెన్నైనా 'కులవిద్యకు సాటిగావు గువ్వలచెన్నా' అన్నాడు.

కుటుం—హా! హా! చదివేస్తున్నావు. నేను తెలుగు చాలా నెగ్లెక్టుచేశాను. నీకు సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు సరే సరి. పైగా కుట్టుపని, వంట. అన్నిటిలో అసాధ్యురాలివిగా ఉన్నావే! అయినా నీకు చాలా కామన్ సెన్సు ఉంది.

సుశీ—ఒకటికాదు లెండి. మీరు వ్యాపారం సర్దుకొని ఆఫీసు పెట్టండి మీకు నేను సెక్రటరీని. మీ ఆఫీసు పనంతా చేస్తాను. టైపు నేర్చుకొంటాను. కరెస్పాండెన్సంతా చూచుకొంటాను. ఫ్యాక్టరీ పెడతారా, ఏపనైనా దగ్గరుండి మనుషుల చేత చేయిస్తాను. మిమ్మల్ని జయించడం సులభం, నన్ను జయించడం అసాధ్యం.

కుటుం—నిన్ను నేను సులభంగా జయించానుగా.

[అని చిఱునవ్వు నవ్వును].

సుశీ—నే నొప్పుకొంటేగా.

[అని కుటుంబరావు చెంపమీద చిన్న దెబ్బకొట్టి.

నాదే జయమండీ అయ్యా నాదే జయమండీ
మీదే జయమని ఉబ్బక ఉండండీ,
త్వరలో మీకే తెలియగలదు లెండీ.
ఏదో ధ్యానముచేతను మీరు
వాదుకు వస్తే ఒప్పను సుండీ ॥ నాదే జయమండీ॥
తామే మేలని తలతురుగాని
మగవారెప్పుడు మొద్దులు సుండీ॥ నాదే జయమండీ॥
ఊరక మాటలు పెంచక త్వరగా
పనిలో చేరండీ అయ్యా పనిలో చేరండీ ॥ నాదే॥

కుటుం—ఆడవాళ్లకి మొండిపట్టు, సులభాన అపజయం ఒప్పుకోరు. అదిసరేగాని చూడు నాలుగువందలు పట్టుకొచ్చాము, ఎక్కువ ఖర్చు చేయలేదనుకో, అయినా చేతులో ఎనభైయేడున్నై. ఊరికివెళ్తూనే సూరిని ఓ నాలుగువందలు తయారుచేయించి పంపించమన్నాను. ఎప్పుడుపంపిస్తాడో తెలీదు. ఒకనెలైంది. బహుశా ఇవాళ రేపులో రావాలి. నేనలా మార్కెట్టుకెళ్లి కూరగాయలు వగైరా పట్టుకొస్తాను. ఇక్కడ దొరక్కపోతే మూరుమార్కెట్టుకు వెళ్లొస్తాను.

సుశీ—వెళ్లి త్వరగా రండి. నే నొంటరిగా చాలాసేపుండలేను. ఈవినింగు మెరీనాకెళ్లాలి ఇవాళ. అదిగో ఒంటి బ్రాహ్మడొస్తున్నాడు. ఆయన్ను పోనిచ్చి వెళ్లండి, అపశకునం.

కుటుం—అపశకునమా? నీకూ ఈ పిచ్చినమ్మకం ఉందా. సూపర్టిషన్ పోలేదే!

సుశీ—ఎలా పోతుందండీ పిచ్చినమ్మకం హిందువుగా పుట్టింతర్వాత. అసలు మహా మహా ఇంగ్లీషు వాళ్లకే ఎన్నో పిచ్చినమ్మకాలు ఉంటాయట.

కుటుం—పోయినాడులే. నేనువెళ్లి త్వరగా వస్తాను.

[అని నిష్క్రమించును.

సుశీ—ఒరే వేలూ, ఇవాళ ఏంసినిమా ఉందిరా?

వేలు—క్రౌన్ లే మారియత్తా, లిబర్టీలే బలేపెళ్లి, గెయిటీలే పయిత్యకారమనిదన్, వెల్లింగ్డన్ లే ఎడ్డిపోలో, సాగర్ లే సగాయం...

సుశీ—వారానికి ఎన్ని సినిమాలు చూస్తావురా నువ్వు?

వేలు—దుడ్డు దొరికితే దెనం సూస్తును.

[లోపలినుండి-కుటుంబరావ్, కుటుంబరావ్-అని పిలుపు]

సుశీ—అదుగో ఎవరో వచ్చారు, వేలూ కనుక్కో.

వేలు—[లోపలికి పోయి మరలివచ్చి] ఆయన ఒగురో సూర్యారావంటా వచ్చి ఉండారు.

సుశీ—రమ్మను. [వేలు పోయి పిలుచుకొనివచ్చును.

సుశీ—ఎప్పుడు రావడం. [వేలు నిష్క్రమించును.]

సూర్యా—[ప్రవేశించి] ఇప్పుడే మెయిలుకు వచ్చాను. నాలుగువందలు తెమ్మన్నాడు కుటుంబరావు. దాన్ని పంపించడానికంటే సొంతంగానే పట్టుకొచ్చి మిమ్మల్ని చూచి మాట్లాడుదామని వచ్చాను.

సుశీ—మంచిపనిచేశా వన్నయ్యా. అక్కడంతా ఏమనుకుంటున్నారు. నాన్న ఎలాఉన్నారు. హోటల్లో భోంచేస్తున్నారా లేకపోతే వంటమనిషిని కుదుర్చుకొన్నారా? ఈయన అంగడికెళ్లారు కూరగాయలకోసం. రావడానికి కొంచెం ఆలస్యమౌతుంది. ఇదుగో కాఫీ తాగుతూ సంగతులు చెప్పన్నయ్యా [అని లోపలికిపోయి స్టౌను, కాఫీపొడుము డబ్బాతో ప్రవేశించును. నీళ్లు పెట్టే ఉంచాను. కాగుతూ ఉంది. నిమిషంలో కాఫీ చేశేస్తాను. మాసంగతి ఊళ్లో, క్లబ్బులో అంతా ఏమనుకుంటున్నారు.

[అని లోపలికి పోవుచు వచ్చుచుండును.]

సూర్యా—నాన్న బాగున్నారు, చాలాసంతోషంగా ఉన్నారు నువ్వు కాపరంచేస్తున్నావని విని. రామయ్యగారి యింట్లోనే భోజనమంతా. ఎప్పుడెప్పుడు వచ్చి మిమ్మల్ని కళ్లారా చూచి చేతులారా నీకు అంతా తీసియివ్వాలని ఉబలాటపడు తున్నారు.

సుశీ—కాఫీ అయింది. [అని కాఫీయిచ్చును.

సూర్యా-[కాఫీ త్రాగుచు] మనం ఇలారాగానే 'ఎంతలో కుటుంబరావు మారిపొయ్యాడు. ఆవిడ పారిజాతం బోధవల్ల బుద్ధొచ్చి తనభార్యను పిలుచుకొనిపోయి చెన్నపట్నంలో కాపు రంపెట్టుకొన్నాడు, ఈవూళ్లో ఉంటానికి సిగ్గుపడి' అని అంటు న్నారు. మీనాన్న స్నేహితులంతా వారిని అభినందిస్తున్నారు. మనరామయ్యగారికి మంచిపేరు.

సుశీ—మావారు పాపం వేరేప్రపంచలో ఉన్నారు. ఇదంతా ఆయనతో చెప్పకన్నయ్యా.

సూర్యా—ఆఁ, ఎందుకుచెప్తాను. అప్పుడేనా? మన కింకా కథ కాస్తనడవాలి. రామయ్యగారు మద్రాసొచ్చి హాస్యం చెయ్యస్దీనా? ఇదుగో ఈడబ్బు దాచిపెట్టు. [అని పర్సిచ్చును.

[కుటుంబరావు ప్రవేశించును.]

కుటుం—హల్లో సూరీ. ఎప్పుడురావడం. [అని కూర గాయలసంచి క్రిందపెట్టి] జాబు వ్రాయకూడదూ.

సూర్యా—మనీ పట్టుకొచ్చాను. ఓమాటు చూచిపోదా మని తోచింది. వై రెందుకివ్వడ మని ఇవ్వలేదు. చక్కా బయలుదేరి వచ్చేశాను,

కుటుం — ఏమనుకుంటున్నారోయి మనవాళ్లంతా.

సూర్యా— బలేపని చేశావనుకుంటున్నారు. మీ ఫాదరిన్లాకూ ఆ రామయ్యగారికి మంచిబుద్ధి చెప్పావనుకుంటున్నారు మనఫ్రెండ్సంతా. పారిజాతం ఫాదరు పోలీసుకంప్లయింటివ్వాలనుకున్నాడు. మళ్లీ వచ్చేతే అవమానమని ఊరుకున్నాడు. ఎప్పుడో వెతుక్కొనివొస్తాడు మొత్తానికి.

సుశీ— అప్పుడు నేనుచూచుకొంటానుగా.

కుటుం— అది. అప్పటికితోచింది చేస్తాం. మాఫాదరిన్లా ఏమంటాడు.

సూర్యా-పాపం! ఏమంటాడు, దిగులుపడిపోయి ఉన్నాడు.

కుటుం-పడడూ ఐతే. దిగులూపడతాడు ఇంకా ఏమైనా పడతాడు. ఆనక్షత్రకుడు ఏమంటాడోయి రామయ్య?

సూర్యా— నిప్పులు కక్కుతున్నాడు. ఎల్లాగైనా నీ ఆ చోకీ తీసి నిన్ను నాలుగూ ఝాడించి అడగాలంటున్నాడు.

కుటుం— వాడిమొహం లే.

సూర్యా-బహుశా అతనూ మీమామగారు నీయింటికి ఒకరోజు వస్తారు లే యిలాఉండగా.

కుటుం— వెంకట్రావుగారొస్తే ఎలాగో దండంపెట్టి సర్దుకొంటా లే.

సూర్యా— సుబ్బయ్యగారొస్తే?

వేలు— [ప్రవేశించి] ఏమండీ, ఎవరో ఒకాయన ఇంటింట్లోదూరి మీపేరడగతా వస్తావుండాడు,

సూర్యా—అతనే అయిఉంటాడు రామయ్యా, కనుక్కొందాం.

[అందఱు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౧౩

[కుటుంబరావు ఇంటి గుమ్మము.]

[ఒకచేత సంచి ఇంకొకచేత చిన్నపడుకతో రామయ్య ప్రవేశించును.]

రామయ్య—కుటుంబరావ్, కుటుంబరావ్.

వేలు—[ప్రవేశించి] ఎవరుసామీ.

రామ—కుటుంబరావుగా రుండడం ఇక్కడేనా?

వేలు—ఇక్కడ అట్టాంటివాళ్లు ఒగురూ లేరండి.

రామ—ఈయింట్లో ఆంధ్రులున్నారని ఆ అయ్యారన్నాడే, అల్ల ఆ కాఫీహోటలాయన.

వేలు—అది యేమిపిత్తలాటమో ఇక్కడంతా తెలుగువాళ్లుదా ఆంధ్రవాళ్లు లేదండీ.

రామ—ఏమిటోయి ఆంధ్రులువేరూ తెలుగువాళ్లు వేరూనా ?

వేలు—అవునండి. ఇక్కడ తెలుగుమాట్లాడేవాళ్లు తెలుగువాళ్లండి. గోదావరి బెజవాడ అంతా ఆంధ్రవాళ్లండి.

రామ—మహా అధికప్రసంగిగా ఉన్నావు.

వేలు—ఈ యీాదికొసలో కడాన అడగండి. అక్కడ లేకపోతే పక్కవీదిల్లో అడగండి.

రామ—[తనలో] ఈకుఱ్ఱాడు అబద్ధాలు చెప్తున్నాడా లేకపోతే కుటుంబరావే ఇంట్లోఉండి తప్పుకొంటున్నాడా ? [ఆయింటివైపు పరకాయించి చూచి] సుశీల కనపడ్డంలేదు. మనుషులున్న అలికిడే లేదు. [ప్రకాశము] అయితే ఈయింట్లో ఎవరున్నారు. మొగాళ్లుంటేకా స్తపిలూ.

వేలు—మొగవాళ్లా నీకుకావలె. నేను మొగవాడుదా, బాగాసూడుమిా.

రామ—ఖబడ్దార్. తమాషాలు నాకు పనికిరావు.

వేలు—ఒగురులేదు సామిా. అంతా బయటపోయి ఉండారు. నేను కావలిఉండాను.

రామ—కావలిఉండావా ? బిత్రగుంటలేవ్రూ. [ఇటూ అటూ చూచి] ఈయిల్లే అంటాడు ఆ అయ్యరు. అయ్యర్లు సాధారణంగా అబద్ధాలాడరే.

వేలు—సర్దా, తెల్లవారితే ఆ అయ్యరు అబద్దాలుతప్పితే ఇంకోటి చెప్పేదిలేదు. ఆయన ఒళ్లంతా అబద్దాలండి.

రామ—మళ్లీ అడుగుతాను [దూరంచూచి చేతులు తట్టి] ఈ యిల్లేనా ? ఆఁ. ఇదే. చూడు ఇదేనంటున్నాడు.

వేలు—అరే పోయ్యా నువ్వు. నిన్ను ఎగతాళిచేస్తాడు. అదిగో తిరిగిచూడు నీవెనకాల నవ్వుతాడు.

రామ—నాఁసెన్స్. ఇదేముటో తమాషాగా ఉంది. నాతోనా మిాచెల్గాటం. [బిగ్గరగా] కుటుంబరావు. కుటుంబరావు.

ఉండు ఆ అయ్యర్ని స్పష్టంగా అడిగి నీతాళంపట్టిస్తాను. వదిలానా మిమ్మల్ని సులభంగా. [అని నిష్క్రమించును.

వేలు—[తనలో నవ్వుకొనుచు] బలే అయ్యోర్యవ, పోతా ఉండాడు.

కుటుం—[తొంగిచూచి వచ్చి] ఏమిరోవ్ పంపించేశావా?

వేలు—ఆయన్నా పోతాడు. మళ్లీవస్తాడు సూడు.

కుటుం—పోలేదురోయి. ఆ అయ్యరుతో మాట్లాడుతున్నాడు, సిగరెట్టు కాల్చుకుంటూ. ఒరే రా లోపలికిపోదాం.

[ఇరువురు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౧౮

[కుటుంబరావు గది. కుటుంబరావును సుశీలయు ప్రవేశింతురు]

కుటుం—చూడు పారూ, ఆరామయ్య వాకిట తిరుగుతున్నాడు. తప్పకుండా మనింటికి వస్తాడు. ఈమాటు వెళ్లడు. ఏంచేద్దాం, ఏమిటి నీ ఆలోచన?

సుశీ—[నెమ్మదిగా] రానీయండి ధారాళంగా.

కుటుం—[ఆశ్చర్యముతో] రానీయడమా, ఇంకేముంది. తర్వాత కొంప మునిగిపోతుంది.

సుశీ—ఎంతకాలం ఇలా దాగుంటాము? పాండవులకైనా అజ్ఞాతవాసం సంవత్సరమే వేశారు.

కుటుం—సరేననుకో. అయినా నాకేమో ధైర్యంరాలేదు. క్రమంగా బైటపడదాం. ఇప్పుడు ఏమిటిమార్గం? మనం ఎల్లాగైనా తప్పుకొని వేరేయిల్లు చూచుకొందాం.

సుశీ—వెంటనే ఎక్కడికిపోగలం? నా ఆలోచన వినండి. ఆయన్ను రానీయండి. ధైర్యంగా మాట్లాడండి. ఆయన ఏమం టాడో వినండి. తర్వాత నెమ్మదిగా, 'అయ్యా మీరు పొరబాటు పడుతున్నారు. నేను నాసొంతభార్యతో కాపురంచేస్తున్నాను గాని నాలో ఎలాంటి అధర్మం లేదు. మీరుమాట్లాడే పారిజాతం ఎవరో నేనెరగను. ఇదుగో కావాలంటే మాకు రెజిస్ట్రారిచ్చిన సర్టిఫికేట్టు' అని చూపించండి. రెండోమాటనకుండా వెళ్లిపో తాడు. అందుకే నా పేరు అప్పుడు అలాయిచ్చాను, చూచారా?

కుటుం—సెబాష్. అదీ మేథా అంటే అలాఉండాలి. [అని రెండడుగులుపోయి మరలివచ్చి] అవును బాగానేఉంది గాని అతను యమముండాకొడుకే దాంతోవెళ్లకుండా లోపలి కొచ్చి నిన్నుచూస్తే.

సుశీ—అంతచొరవగా వచ్చిచూస్తే చూడనీయండి. తప్పేముందీ? నేనేం మైనరునుకాను. నాబుద్ధిపూర్వకంగా మిమ్మల్ని వివాహంచేసుకున్నాను. మన సొంతవ్యవహారాలలో ఈయనకేం జోక్యం. అలా లోపలికొస్తే నేను ధైర్యంగా దబాయించి పంపించివేస్తాను.

కుటుం—అంతే అంటావా? సరే.

[నేపథ్యమునుండి—కుటుంబరావ్, కుటుంబరావ్]

కుటుం—అదుగోవచ్చాడు, వదలడు, నువ్వు లోపలికెళ్లు.

[మరల—కుటుంబరావ్] [సుశీల నిష్క్రమించును.

కుటుం—ఆఁ. ఆఁ. వస్తున్నాను. [లోపలికిపోయి రామయ్యతో మరలివచ్చి] రండి రామయ్యగారూ రండి. ఎప్పుడొచ్చారేమిటి? నా అడ్రసు కనుక్కొన్నారే సులభంగా.

రామ—[కోపముతోను విసుగుతోను] సులభంగానా? ఇప్పటికి ఈవీధిలో పదిమాట్లు తిరిగాను. మీసర్వెంటు కుర్రాడు, తుంటరివెధవ, ఇందాక నేనొస్తే నువ్వు ఉన్నావని లేవని చెప్పకుండా, అలాంటి ఆసామే లేడు, ఇక్కడ ఆంధ్రులులేరు తెలుగువాళ్లున్నారని వెధవకూతలు కూస్తాడు. ఎక్కడో ఆథ్వాన్నపు పేపరులో ఎందులో చూచాడోకాని అంధ్రులు వేరట తెలుగువాళ్లు వేరట. మళ్లీవెళ్లి ఆహోటలు అయ్యర్ను అడిగి కనుక్కొని వచ్చాను. గూబ అదరేస్తానుండువాడు నా కౌపడితే.

[వేలు లోపలినుండి తొంగిచూచి పోవును.]

కుటుం—అలాగా, వాడొక తుంటరివెధవ కుదిరాడు. మమ్మల్నే తమాషాచేస్తుంటాడు. వాడివొక హాస్యం.

రామ—హాస్యం. వెధవహాస్యం. నాతోనా వీడిచేష్టలు.

కుటుం—పోనీండి. ఏదో దైవాధీనం వచ్చారు. చాలా సంతోషం. మంచినీళ్లు కావాలా?

రామ—వద్దులే నాయనా. ఇప్పుడే కాఫితాగివస్తున్నాను. నిన్నుచూచాను. అంతే సంతోషం. నాకు కడుపునిండిపోయింది.

కుటుం—ఏమిటీ చాలా ఖంగారుపడ్డట్టున్నారు.

రామ—ఖంగారో గింగారో. అబ్బాయి, ఈ చెన్నపట్టణ ప్రయాణం రావడం ఒకయెత్తు, నిన్ను వెతుక్కొనిరావడం ఇంకొకయెత్తూను. నాప్రాణం తీశేశావు.

కుటుం—మీ మాటలధోరణి నాకేమీ అర్థంకావడం లేదు.

రామ—నాధోరణి అర్థంకావడంలేదూ? ఎందు కొతుం దబ్బాయి. పాతకాలపు ముసల్నాణ్ణి. నేనూ ఎవరినైనా చదువులు గిదువు లంటూ నాలుగు ఇంగ్లీషు తొసేస్‌బుస్ అనేదాన్ని లేవ దీసుకు వచ్చుంటే నాధోరణి అర్థమై ఉండేది.

కుటుం—ఏమిటండీ ఇదంతా? విషయంచెప్పండి.

రామ—విషయమా? ఏముందీ నీకు తెలియంది, కొత్తగా. నాకాళ్లరిగిపోయేటట్టుగా నీయింటికి తిప్పావు. అప్పుడే నీ ఉద్దేశం ఫలానా అనుంటే నాకీశ్రమంతా ఉండేదికాదుగా. నువ్వు ప్రబుద్ధుడివి గనక పలక్కుండా అల్ల మహాబలం వెంట్రావుగారి కూతురు పారిజాతాన్ని లేవదీసుకుని చక్కా వచ్చావు. ఘన కార్యంగా. అందుకు నిన్ను నేను అభినందించొద్దూ.

కుటుం—పొరబాటు పడుతున్నారు. ఎవరండీ మీతో అలా అన్నవారు.

రామ—ఎవరా? ఊళ్లో అందరికీ తెలుసు. నీ ఫ్రెండ్సందరికీ తెలుసు. ముందే మాట్లాడుకొని చేశావట. అల్లాడిపోతున్నాడు వెంకట్రావు. పాపం పెద్దవాడు, మింగాలేడు, కక్కా లేడు. నాతోనేవచ్చాడు, హోటల్లో ఉన్నాడు. సాయంత్రం పిలుచు కొస్తానుగా ఇక్కడికి.

కుటుం—వట్టి అపోహ. ఎవరో కిట్టనివాళ్లు కల్పించిన మాట. వట్టి అసత్యం, అసత్యం.

రామ—అబ్బాయి, కుటుంబరావూ, అధర్మానికి వెరవక పోయినా లోకానికి వెరవాలి. నిన్నొదిలిం దెవరురా నిజం బైట పడిందాకా.

కుటుం—నిజంచెప్తే ఒప్పుకుంటారా?

రామ—ఆహా! అలా దోవకురా.

కుటుం—మీ రనేసంగతు లేవో నాకు తెలీదు. నేను నా సొంతభార్యతో కాపురంచేస్తున్నానుగాని ఎవరినిగాని వాళ్ల యిష్టంలేకుండా, బలాత్కారంగా లేవదీసుకొనిరాలేదు. భగవత్ప్రీతిగా నేను ప్రేమించినకన్యను వివాహమాడి సుఖజీవనం జరుపుతున్నాను. నాలో ఏదోషమున్నూ లేదు. ఐతే సివిల్ రెజిస్ట్రేషనుమ్యారేజి చేసుకున్నాము. చూపెడతాను మాసర్టిఫికేట్టు చూడండి. [అని లేచి డ్రాయరులో వెదకును.]

రామ—చూపించు. అలా ఏదన్నా దాఖలాచూపిస్తే మంచిదే.

కుటుం—ఇదుగో సర్టిఫికేటు, చూడండి. [అని చూపును,

రామ—[చదివి] సుశీల? [ఆశ్చర్యంతో లేచి నిలిచి] పారిజాతంకాదూ?

కుటుం—[గర్వముగా] ఎంతమాత్రం కాదు.

రామ—మా సుశీలేనా [అని గబగబనడచి] అమ్మాయి సుశీలా, సుశీలా. [అని లోపలికి పోవును]

కుటుం—ఆఁ. ఆఁ. వెళ్లకండి, వెళ్లకండి [అని ఆపఁబోయి] వెళ్లిపోతున్నాడే చక్కా లోపలికి.

[రామయ్య సుశీలతో వచ్చును]

రామ—మా సుశీలే! అమ్మయ్యా, ఎంతపుణ్యం! ఎంత సుకృతం. నాయనా క్షమించు. నేను నీవిషయంలో చాలా అప రాధంచేశాను, నీవు మహాగొప్పవాడివి. అగ్నిసాక్షిగా వివాహ మాడినభార్య సుశీలతో సంసారంచేస్తున్నావు. సంసారిపక్షంగా ఉన్నావు. తెలిసింది, నలుగురికీతెలిసి భార్యను పిలిపించుకోడానికి సిగ్గుపడ్డావు; ఇలాచేశావు. మాంచిపనిచేశావు. ఈవిషయం తెలీక ఎవళ్లెవళ్లో ఏవేవో అంటే నమ్మి నీ కోమలహృదయాన్ని చాలా నొప్పించాను; ఘాతచేశాను. బాబూ కుటుంబరావు క్షమించు నాయనా. నేను ఈమధ్య సుబ్బయ్యగారింటికెళ్ల లేదు. వెళ్లుంటే ఈ అమ్మాయి అక్కడ నాకు కనిపించి ఉండదు. నిజం తెలిశేది. అంచేతేగావును సుబ్బయ్య ఖంగా రేమీలేకుండా హాయిగా ఉన్నాడు. లేకపోతే నాకు కబురంపి ఉండేవాడు. అమ్మా సుశీలా, నువ్వెంత మంచితల్లివే. మీనాయనచూస్తే ఎంత సంతోషిస్తాడు. ఆయనకు తెలుసా తెలీదా? ఎందుకూ, నేనువెళ్లి కనుక్కుంటాను. చక్కా పిలుచుకొస్తాను.

కుటుం—[సుశీలను చూచి ఆశ్చర్యముతో] ఏమిటిది? రామయ్యగారి కేమయినా మతిచెదరిందా? ఏదో చిత్తచాం చల్యం కలిగినట్టుది. భ్రమపడుతున్నారు. అయ్యా, రామయ్య గారూ, ఉండండి. మీరు నన్నెగతాళిచేస్తున్నారు. ఈ అమ్మాయి మీసుశీలకాదు, నాసుశీల బాగాచూడండి.

రామ—[నవ్వుచు] ఎలాఐతే నేం. మీసుశీల మాసుశీల అంతా ఒకటే.

కుటుం—ఏమిటండీ మీరనడం. కళ్లజోడు తగిలించుకొని చూడండి.

రామ—[సులోచనములు తగిలించుకొని] ఇంకా ఎలా చూడమంటావయ్యా, బలేవాడివే. కనుకట్టువిద్య ఏమన్నా నేర్చుకొన్నావా యేం. సాక్షాత్తు మాసుశీలే సుబ్బయ్యగారికూతురే. ఈ అమ్మాయికోసమే నీయింటికి నేను వందపర్యాయాలు తిరిగాను. నామాట అప్పుడు నీకు లక్ష్యంలేకపోయిందో ఏమిటో, తర్వాత ఎవళ్లతోను చెప్పకుండా నీకు స్వాధీనంచేసుకొని పిలుచుకొనివచ్చావు. కాస్త మాకు బుద్ధిచెప్పదలచుకొన్నావు. పర్వాలేదులే, దానికేమిలే; బండి ఎన్నివంపులుతిరిగినా ఊరుపోయి చేరిందన్నారు. అంతేసంగతి. [నెమ్మదిగా నవ్వుచు] అబ్బాయి పరిహాసంవద్దు లే. సంతోషం, చాలాసంతోషం. మాకోరిక నెరవేరింది. మరి సుబ్బయ్యగారికి టెలిగ్రామిచ్చివస్తాను. [ఒకయడుగు పోయి మరలి వచ్చి] అమ్మాయి పదకొండింటికల్లా భోజనానికి తయారౌతాను.

[అని వడిగా నిష్క్రమించును.

కుటుం—[ఆశ్చర్యపడుచు] నిజంగా రామయ్యగారికి పిచ్చిపట్టిఉంది. ఏదో భ్రమలో ఉన్నాడు. ఎందుకో ఇలా అయినాడు పాపం.

సుశీ—మనమొకలా గనుకొంటే ఇది మరొకలా గయింది.

కుటుం—నిజంగా మనిషిని పోల్చుకోలేనంత మతి భ్రమ లోపడ్డాడా రామయ్య పాపం. ఆ. అన్నావు కాదూ, మీ రిద్దరూ ఇంచుమించు ఒకలాగుంటాకని. ఐనా ఇది ఆశ్చర్యమే. మళ్లీ వెఱ్ఱివాడిలా లేడు.

వేలు—[ప్రవేశించి] మీ కోసం ఎవరో ఒకమ్మ వచ్చి ఉండారు. పేరు రాశియిచ్చి ఉండారు. [అని ఒక విజిటింగు కార్డిచ్చును.

కుటుం—[చదివి] మిస్ పారిజాతం బి. ఏ.

[అని ఆశ్చర్యముతో సుశీలను చూచును.

సుశీ—[ఆచీటిచూచి] రమ్మనండి, చూదాం ఎవరో.

కుటుం—రమ్మనరా, ఆమె ఎవరో.

[వేలు నిష్క్రమించును.

[సుశీల మెల్లగా లోపలికిపోవును. పారిజాతం ప్రవేశించును.]

పారి—నమస్కారాలండి. మీ రేగదండి కుటుంబరావు గారు బి. ఏ.

కుటుం—[లేచి] అవునండి. కూర్చోండి.

[ఇద్దఱు కూర్చుందురు.

పారి—నేనూ మీవారూ కూడాచదువుకొన్నామండి చిన్నప్పుడు. బాల్యస్నేహంచేత చూడాలని వచ్చాను. సుశీల ఉందాండి.

కుటుం—సుశీల! [అని బిత్తరపుచూపులు చూచి] లేదే.

పారి—లేదాండి. మీవా రింట్లో లేరాండి?

కుటుం—అంటే మీ కెవరు కావాలో నాకు తెలియడం లేదు. మీ రేదో పొరపాటుపడుతున్నా రనుకుంటున్నాను.

సుశీ—[తటాలున వచ్చి] పారూ, నువ్వా రా, రా. ఎప్పుడువచ్చావు? ఎంతసంతోషమే. రా లోపలికి రా.

[అని లోపలికి పిలుచుకొనిపోవును.

కుటుం—వాటీస్ దిస్. నేను నిద్రపోతున్నానా మేలుకొనున్నానా? పారిజాతంకాదు సుశీలంటాడు రామయ్య. ఈమెవరోవచ్చి తానే మిస్ పారిజాతం బి. ఏ. అని అంటుంది. వీళ్ల మాటలధోరణిచూస్తే ఆలాగే ఉంది. రెజిస్ట్రారాఫీసులోను తన పేరు సుశీలనే యిచ్చింది. న న్నేమన్నా వేళాకోళం పట్టిస్తున్నదా లేకపోతే ఇద్దరిపేర్లూ ఒకటేనా?

రామ—[ప్రవేశించి] నేను తంతి ఇవ్వక్కరలేకుండా సుబ్బయ్యగారే ఈవూరికి వచ్చున్నారట. మన ఊరివాడు కారం సెట్టి వెంకయ్య అవుపడి చెప్పాడు. మన అడ్రసు తెలియక ఎక్కడ వెతుకుతున్నాడో మరి. నాతోవచ్చుండినా సరిపోయి ఉండేది. పాపం ఆయనకూడా ఉండబట్టక నావెనకాలే బయలుదేరినట్టున్నాడు.

కుటుం—ఇదేమిటో, ఇదంతా నాకేమీ అర్థంకావడం లేదు.

రామ—అన్నావుగా నాకు మతిపోయింది, చిత్తచాంచల్యం అని ఇందాకా, అదే, ఆభావతే.

వేలు—[ప్రవేశించి] ఎవరో సుబ్బయ్యగారంటూ వచ్చుం డారండి.

రామ—ఆఁ. వారే. అయ్యా రండి. సుబ్బయ్యగారూ రండి. ఇక్కడే ఉన్నాం.

సుబ్బ—[ఉస్సనుచు సంచి క్రిందపెట్టి] బతికానురా బాబూ. ఎంత తిరగాలిసొచ్చింది, ఎంత తిరగాలిసొచ్చింది! ఈ అడ్రసు కనుక్కొనేటప్పటికి తలప్రాణం తోకకొచ్చింది.

రామ—అంతవరకూ నయం. ఈ వీధికాదని ఈ యిల్లు కాదని మిమ్మల్నెవరూ వేళాకోళం పట్టించలేదుగదా? [వేలు నవ్వుచు దూరముగా పోవును] రా దగ్గరికి నిన్నేంజేస్తానో. సుబ్బయ్యగారూ కూర్చోండి, కాస్త ఆయాసం తీర్చుకోండి. అమ్మాయి సుశీలా మీనాన్నొచ్చారు.

సుశీ—[వడివడిగా ప్రవేశించి] నాన్నా వచ్చావా? రా, రా, తంతియివ్వకుండా జాబన్నా రాయకుండా హఠాత్తుగా వచ్చావేం?

సుబ్బ—మీ అడ్రసుకోసం కష్టపడ్డాను. కనుక్కొన్నాను. వెంటనే బయల్దేరాను.

సుశీ—ఉండండి మీకంతా కాఫీయిస్తాను.

కుటుం—[ఆశ్చర్యపడి ఒకరినిమార్చి ఒకరిని చూచు చుండును.]

సుబ్బ—మిమ్మల్ని ఉభయుల్ని చూచింతర్వాత పరమా నందమైపోయింది. కాస్తతాళి కాఫీ తాగుతానులే. నేను

స్నానంచెయ్యనీద్దీ ఏమీా ముట్టుకోను. అబ్బాయీా కుటుంబ రావ్రా చాలాసంతోషం. నీవు ఇంత విశాలహృదయుడివని తెలి యకపోయింది. మా అపరాధాలను క్షమించి నీభార్యను గ్రహించి ఇలారావడం మాకెంతో సంతోషంగా ఉంది.

రామ—వత్సరాజును అల్లుణ్ణి చేసుకోవాలని చండ మహాసేనుడు మోసంచేసి ఖయిదు పట్టుకోపోతే బదులుకు వత్సరాజు చండమహాసేనుడికూతురు వాసవదత్తతో రహస్యం గా పారిపోయినాడు.

సుశీ—నాన్నా పారిజాతంకూడా ఇప్పుడేవచ్చింది.

సుబ్బ—ఆ. అలాగా? ఏదీ. [పారిజాతం ప్రవేశించును.

రామ—ఏమమ్మా పారిజాతం. ఎప్పుడొచ్చావు ? కులా సాగా ఉన్నావా ? మీానాన్నగారు వెంకట్రావుగారు బాగు న్నారా ? సంతోషంమీాద సంతోషం.

పారి—నేనిక్కడే మద్రాసులోనే ఉన్నాను మామయ్యా. నాజాబులు మానాన్నకి రెండుమూడు చేరలేదు. అంచేత ఖంగారుపడ్డట్టున్నారు.

రామ—నిజమే. చాలాదూరంపోయింది కథ.

పారి—సుశీలను చూదామని వచ్చాను.

కుటుం—[తనలో] ఈవిడ మిస్ పారిజాతం. నే నిన్నాళ్లు పారిజాత మనుకుంటూవచ్చింది నాభార్య సుశీలే. ఇదంతా ఈ రామయ్య చేయించిననాటకం. నాకు బాగాటోపీవేశాడు. వెంక ట్రావుగారు మండిపడుతున్నారని, పోలీసు కంప్లయింటివ్వబోయి

నారని సూర్యారావన్నదీ, తనతోకూడా వచ్చారని ఈయన చెప్పిందీ అంతా అబద్ధంలా కనబడుతుంది. ఇది నిజంగా పారిజాతం కాదు, సుశీలే; లేకపోతే వీళ్లతో ఇలాచేరదు, ఇంతత్వరగా. ఎంతలో మారిపోయింది! [ప్రకాశము] అయ్యా రామయ్యగారు, ఇదంతా ఏమిటండీ, నాకేమీ అర్థంకావడంలేదు. మీరంతా మాట్లాడుకొనివచ్చి నాయింట్లో గల్లంతుచేస్తున్నారు. వాస్తవం చెప్తారా లేదా?

రామ—ఇదే వాస్తవం, యథార్థం, నిజం, తథ్యం, నిష్కల్మషం, సత్యం. ఏముందీ? నీభార్యతోటి నీవు హాయిగా సుఖజీవనం జరుపుకొంటూఉన్నావు. పారిజాతం గీరిజాతం ఎవరో నీవెరగవు. మాకందరకీ చాలాసంతోషంగా ఉంది.

సుబ్బ—చాలాసంతోషం, చాలాసంతోషం.

కుటుం—నాన్‌సెన్స్. [అని, సుశీలను ఉద్దేశించిచూచి] ఏమిటిదంతా?

సుశీ—అవునండీ. నేనేనండి,

కుటుం—నువ్వు [ఆశ్చర్యముతో] ఈనాటకమంతా నీ వాడిస్తున్నావా? సూర్యారావు నడిగితే చెప్పేస్తాడు.

సూర్యారావు—[ప్రవేశించి] హలో కుటుంబ్. ఓహో రామయ్యగారా, ఓ సుబ్బయ్యగారుకూడా వచ్చారే. ఎప్పుడొచ్చారండి? భేష్, భేష్. అంతా మళ్లీ ఒకచోటే కలిశారే!

కుటుం—అసే సూరి. ఏమిటీనాటకమంతా? నిజంచెప్తావా లేదా?

సూర్యా—[అందఱను ఒకమారు చూచి] ఏమీలేదు బ్రదర్. మనల్ని ఈరామయ్యగారు బోల్తాకొట్టించారు. మనం ఇన్నాళ్లూ మిస్ పారిజాతం అనుకొంటూ వచ్చిన అమ్మాయి మిస్ పారిజాతంకాదు, నీ ఒరిజినల్ వైఫ్ సుశీలే. సుబ్బయ్యగారు ఇంట్లో ఎజుకేట్ చేయించారు. నిజంగా మిస్ పారిజాతం అనేది ఈఅమ్మాయి బి. ఏ.

కుటుం—నువ్వూ వాళ్లల్లోకలిశి నాకు టోపీ వేశావన్న మాటే. నీకు ఫ్రెండన్నావు, కాలేజిమేటన్నావు, సిస్టరన్నావు; అంతా అబద్ధమే!

సూర్యా—కాదూ బ్రదర్, నీవైపు నాకు సిస్టరేగా.

రామ—నాయనా కుటుంబరావూ, నామాట విను. నీవు ఒకభ్రమలో ఉంటూవచ్చావు. అయితే నీహృదయం విశాలమైందని నేనెరుగుదును. ఎజుకేషను కావలెనని కోరావు, ఫ్యాషనుగా ఉండాలన్నావు. అయితే నీవుకోరే ఎజుకేష నేమిటో, ఫ్యాష నేమిటో, ఎలా ఉండాలో నీకే అయిడియా లేదు; అంటే భావంలేదు; మాకు అంతకంటే లేదని గ్రహించాను. నీకు కావలిసిన వస్తువు నీదే ఉంది. ఆ ముక్క అంటే నీబుఱ్ఱకెక్కదు. అంచేత మరోపేరుపెట్టి, అసలువస్తువునే పేరుమార్చి అమ్మేవర్తకుల్లాగ, నీగృహలక్ష్మినే నీకు చూపించాము. నీకు పూర్తిగా నచ్చింది, పరిగ్రహించావు. సంతోషంగా ఉన్నావు. ఏపేరుతో వ్యవహరిస్తేనేమి? మా సంతోషాన్ని మేం వెలిబుచ్చాం.

సూర్యా—అంతే బ్రదర్. అక్షరాలా నిజం. ఈ అమ్మాయి మిస్ పారిజాతం బి. ఏ. ఈప్లాను వేసింది. మన సుశీలకు ఇంట్లో ఇంగ్లీషు ఎజుకేషనిచ్చింది. ఏయేసందర్భంలో ఎలా ఉండాలో చెప్పింది. ఈనాటకానికంతా సూత్రధారిణి ఈమె. మేమంతా వట్టిపాత్రలం. అసలు ఉత్తమఫలానికి పాత్రం నువ్వే.

కుటుం—[సంతోషముతో] అదాసంగతి. ఫలమేమో ఉత్తమ మేగాని నేను మాత్రం వట్టి అపాత్రుణ్ణి. చేతులో వెన్న బెట్టుకొని నేతికి ముష్టికెళ్లాను. [సుశీలనుచూచి] నువ్వేనా చివరకు!

సుశీ—[సిగ్గు నభినయించుచు] నేనే.

కుటుం—ఎప్పుడూ సూచించావుకూడా కావే ?

సుశీ—సూచించ కేమండీ. మొదట పార్కులో ఏమన్నాను జ్ఞాపకంతెచ్చుకోండి. రెజిస్ట్రారాఫీసులో దేవుడియెదట ప్రమాణంచేసి నిజమే చెప్పానుగాని అబద్ధంచెప్పానా ?

కుటుం—దేర్ యువార్ [ఆలోచించి] నేనే బుద్ధిహీనుణ్ణి, కనుక్కోలేకపోయినాను.

సూర్యా—మేమంతా 'ఓమాటు వెళ్లిచూడవోయి, పాతకథలు మానేశి' అని చెప్పితే నువ్వు అక్షరం విన్నావుకావు. ఆలోచించి వస్తువు నీకంట్లోవేశాము. ఆ పైకార్యం నువ్వే సాధించావు.

సుశీ—నన్ను క్షమించండి. మిమ్మల్ని మోసంచేశాను.

కుటుం—ఓ, నో, నో. నీవే నన్ను క్షమించాలి. నాకు నిజంగా బుద్ధిచెప్పావు. నీమాటలు చేష్టలు అంతా నా కిప్పు దర్థ

పోతూంది. అందుకే అన్నావు 'పేరుతో మీ కేమి, మీకు కావల సింది నేనేగా' అని. పార్కులో ఆడినం నా కెంతబుద్ధిచెప్పావు. నిజం. పేరులో ఏముంది. వస్తుతత్వం తెలియక లోకంలో నాలాంటిమూఢులు ఎందరు మోసపోతున్నారో. అందరికీ నీ లాంటి సుశీల దొరకదు. రొట్టివిరిగి నేతిలోపడింది.

సుశీ—సుశీల కాదండి, పారిజాతం అనండి. ఈవిడే మీ పాలిటి దేవపారిజాతం. మనకీ మహోపకారం చేసింది. రైల్లో మనతో కూడావచ్చిన ఖడీజా బీబీ.

కుటుం—ఆ అదే గొంతుక, పోల్చుకోలేకపోయాను. అమ్మా మీరెవరో తల్లిలాగ నాకు మహోపకారంచేశారు. నమస్కారాలు. రామయ్యగారూ క్షమించండి. నిజంగా నేనే భ్రమలో ఉంటూవచ్చాను. నాభ్రాంతివల్ల పెద్దవారిని మిమ్మల్ని ఏవేవో దుర్భాష లన్నాను. నాది వట్టివ్యామోహం, అర్థంలేని వ్యామోహం, నిజంగా నాకే మతిభ్రమ, చిత్తచాంచల్యం; నా అజ్ఞానాన్ని పోగొట్టిన విజ్ఞాని మీరే.

రామ—అబ్బాయి కుటుంబరావు, నీ వేమంటూవచ్చినా నాకుసంతోషంగానే ఉంటూవచ్చిందిగాని నేనేమీ అనుకోలేదు. మా కార్యం నెరవేరింది. అదే మాకు సంతోషం. భ్రాంతిలో, వ్యామోహంలో పడ్డానన్నావే అది నీతప్పుకాదు. నీవయస్సుది ఆతప్పు. ఈలాంటి వ్యామోహం నీలాంటి యువకులకందరికీ ఉంది. ఫ్యాషననీ సొసయిటీ అని వట్టి తళుకు ఆడంబరాల మీద మోజుపడక వాస్తవమైన గృహిణిని, విజ్ఞానవంతినిని, సర్వ

విధముల తన్ను బాగుపరిచేదాన్ని సంపాయించుకోనేవాడే బుద్ధిమంతుడు. నీవు యువకుడివి, మహాశయుడివి. అంటే గొప్ప ఆశయాలు కలవాడివి. అభ్యుదయానికి పాత్రుడివి. నీకే అర్థం కాని వ్యామోహంవల్ల వాస్తవంగా నీ కేమికావాలో, నీవు కోరే దేమిటో చెప్పలేక మూగవాడిలాగ బాధపడ్డావు. నీవు కోరింది నీదగ్గరే ఉంది. దాన్నే నీకు మేం అందజేశాం. ఇంతా ఎందుకు చెప్పవచ్చానంటే యువకుల అక్కరలను కనుక్కొని వారి మనస్తత్వం ప్రకారం వెళ్లడం పెద్దవాళ్లపని; పెద్దవాళ్ల మాటలు వినడం యువకులపని. ఈరహస్యాన్ని గ్రహించిననాడే మనదేశం, మనసంసారాలూ బాగుపడగలవు.

కుటుం—[సుబ్బయ్యగారిని సమీపించి] నన్ను క్షమించండి.

సుబ్బ—సుఖంగా ఉండు బాబూ. రామయ్యగారూ మీకందరికీ విందు చేయవలసినబాధ్యత నాది. అందరం ఊరికి రాత్రిప్రయాణం. ఊళ్లో విందు.

సుశీ—[కుటుంబరావును చూచి] జయ మెవరిది?

కుటుం—నీదే. మీకందరిదీని.

---

మదరాసు. 20-8-1952, 1000 ప్రతులు.

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4. మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీధి, మదరాసు. 1.

ఆర్డరుతోకూడ అడ్వాన్సు పంపవలెను. తపాలుచార్జి ప్రత్యేకము.

మొత్తముగా కొనువారికి మంచి కమీషనుకలదు.

## సంస్కృతగ్రంథములు

| | రు. | అ. |
|---|---|---|
| మేఘసందేశము, మల్లినాథవ్యాఖ్య, తెనుఁగున సంపూర్ణ ప్రతిపద టీకాతాత్పర్య పదప్రయోజనచర్చ-ఆక్షేపసమాధానములు | 2 | 8 |
| రఘువంశము, మొదటి 6 సర్గలు పైదానివలెనే టీకాతాత్పర్యములు | 3 | 0 |
| కుమారసంభవము, మొదటి ఆఱుసర్గలు, పైదానివలెనే ... | 3 | 0 |
| అమరుకావ్యము, శృంగారతిలకము. వేమభూపాలవ్యాఖ్య. సంపూర్ణాంధ్రటీక, క్రొత్తయచ్చు ... | 2 | 0 |
| రసమంజరి, శృంగార రసస్వరూపవివరము. సటీక క్రొత్తయచ్చు | 2 | 0 |
| పంచతంత్రము, మూలముమాత్రము ... | 1 | 8 |
| దశకుమారచరిత్రము, మూలముమాత్రము ... | 1 | 0 |
| హితోపదేశము, ,, ... | 1 | 0 |
| ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి తెనుఁగు టీకాతాత్పర్యములు గద్యపద్యములుగా ఆంధ్రీకరణము ... | 1 | 0 |
| ఈ 9 గ్రంథములు ఒకసెట్టుగా కొనువారికి ... | 12 | 0 |

## ఆంధ్రగ్రంథములు

| | రు. | అ. |
|---|---|---|
| ఆముక్తమాల్యద, సంజీవనీ వ్యాఖ్యతో ... | 15 | 0 |
| విజయవిలాసము, చేమకూర వేఁకటకవి. సటీక ... | 3 | 0 |
| జ్ఞానవాసిష్ఠ రామాయణము, వేదాంతము, మడికిసింగనకవి | 1 | 8 |
| ఆంధ్రబిల్హణీయము, మూలము ... | 0 | 8 |
| పారిజాతాపహరణము. ,, ... | 0 | 8 |
| సారంగధరద్విపద. కవి బాణాలశంభుదాసు. విశ్వకర్మమతస్థుఁడు | 0 | 8 |
| పద్యకథావళి, ప్రాచీన గ్రంథములనుండి సంగ్రహింపఁబడిన చిన్నపద్యకథలు. | | |

నన్నెచోడకవి చరిత్ర 12

# ఆంధ్రగ్రంథములు

| | రు. | అ. |
|---|---|---|

## నాటకములు

| | రు. | అ. | | రు. | అ. |
|---|---|---|---|---|---|
| ప్రతాపరుద్రీయ నాటకము | 2 | 8 | బొబ్బిలి యుద్ధ నాటకము | 1 | 8 |
| ఉషా నాటకము | 1 | 8 | ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము | 1 | 8 |
| విక్రమోర్వశీయ నాటకము | 2 | 0 | మాళవికాగ్నిమిత్ర నాటకము | 0 | 12 |
| ప్రియదర్శికా నాటిక | 0 | 8 | శ్రీకృష్ణరాయవిజయ నాటకము | 0 | 8 |

| | రు. | అ. |
|---|---|---|
| రత్నావళీనాటిక, శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారి వ్యాఖ్యతో | 1 | 8 |
| ఉత్తరరామచరిత్ర నాటకము, శాస్త్రిగారి పీఠికతో ... | 2 | 0 |
| ఈ 10 నాటకములు పూర్తిసెట్టుగా గ్రహించువారికి | 10 | 0 |

## సులభవచనగ్రంథములు. (నాండీబయిల్డు)

| | రు. | అ. |
|---|---|---|
| భోజకాళిదాసకథలు అప్రూవ్డు iii, iv ఫారములకు ... | 0 | 12 |
| విక్రమార్కునియద్భుతకథలు ,, iv, v ఫారములకు ... | 0 | 12 |
| ఉదయనచరిత్రము ,, డిటో ... | 0 | 12 |
| బేతాళపంచవింశతిక ... | 0 | 12 |
| అక్కన్న మాదన్నలచరిత్ర (తానీషా). (మెట్రిక్యులేషను) | 2 | 0 |
| ఆంధ్రహితోపదేశచంపువు ... | 1 | 8 |
| ఈయీ గ్రంథములు ఒకసెట్టుగా కొనువారికి ... | 5 | 0 |
| కథాసరిత్సాగరము 6 భాగములు ... | 15 | 0 |
| ,, ఒక్కొక్కభాగము ప్రత్యేకముగా ... | 2 | 8 |

## లక్షణగ్రంథములు

| | రు. | అ. |
|---|---|---|
| ఆంధ్రసాహిత్యదర్పణము, ఉదాహరణశ్లోకములతో ... | 5 | 0 |
| కావ్యాలంకారచూడామణి, 9 ఉల్లాసములు పూర్తి ... | 1 | 8 |
| అలంకారసారసంగ్రహము, టీకాతాత్పర్యము ... | 0 | 12 |
| ఛందస్సు, సులువు, సంగ్రహము ... | 0 | 4 |
| కుమారదేవ పండితీయము, ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య ... | 2 | 8 |

శాస్త్రిగారి విమర్శలు—ఉపన్యాసములు రూ. అ.

| | | |
|---|---|---|
| గ్రామ్యభాషాప్రయోగనిబంధనము, నాటకములపాత్రోచితభాషను గురించినది ... | 0 | 12 |
| ఆంధ్రవ్యాకరణ సర్వస్వతత్త్వము ... | 1 | 0 |
| విమర్శవినోదము, సంస్కృతాంధ్ర కావ్యములను గురించినది | 0 | 12 |
| తిక్కనసోమయాజి విజయము, విమర్శ ... | 0 | 8 |
| భారతాభారత రూపకమర్యాదలు (ఇందు నాటకశాలి—హానిచరిత్రము, లక్షణము మొదలైన విషయములు గలవు) ... | 0 | 6 |
| ఆంధ్రగ్రంథ విమర్శన ప్రకారలేశము ... | 0 | 6 |
| గ్రామ్యాదేశనిరసనము, గ్రామ్య గ్రాంధిక వాదములను గురించినది. అన్ని జిల్లాల వ్యావహారిక భాషలను వర్ణించియున్నారు; కనువిప్పు నవ్వించు విమర్శ ... | 0 | 6 |
| విసంధివివేకము ... | 0 | 2 |
| స్త్రీపునర్వివాహగ్రంథము ... | 1 | 0 |
| ఆంధ్రభాషాసర్వస్వార్థనియమకలిపములు (నిఘంటురచనావిధి) | 0 | 4 |

నేలటూరి వెంకటరమణయ్యగారి గ్రంథములు

| | | |
|---|---|---|
| చరిత్రరచన (మొదలైన చారిత్రకవ్యాసములు) ప్రథమభాగము. ఆంధ్రులు, పల్లవులు, చాళుక్యులు, చోళులు మొదలైనవారి చరిత్రములు చక్కగా వివరింపబడియున్నది. యూనివర్సిటీ విద్యార్థుల కుపయోగకరము. ... | 2 | 0 |
| మధుమావతి (మొదలైనకథలు) ఇందు మధుమావతి, ప్రతీకారము, కంపిలిరాయలు, ఛత్రగ్రాహి అను నాలుగుకథలు చరిత్రాత్మకములు గలవు. మధుమావతి ప్రతాపరుద్రుని వేశ్యయైన మాచల్దేవి కూతురై, ఓరుగంటి ముట్టడిలో నీమె తురకలకు కట్టుబడిచేసిన చమత్కారకథ ఇది. ప్రతీకారము, మధురను పాలించిన సుల్తాను హిందూస్త్రీని చెఱపట్టగా నామె కసిదీర్చుకొనిన కథ. కంపిలిరాయలు విజయనగర సామ్రాజ్యస్థాపనమునకు పూర్వము కంపిలిరాజ్యమును తురకలుకూల్చినకథ ఛత్రగ్రాహి, కృష్ణదేవరాయలగొడుగుమోపరి, పోలఁడు, ఒకదినము రాయసింహాసనమెక్కిన విచిత్రకథ | 2 | 0 |

రు. అ.

BY Dr. N. Venkataramanayya, M.A., Ph.D.

*Kampili & Vijayanagara* 2 0

*Eastern Chalukyas of Vengi* 15 0

శ్రీ ప్రొఫెసర్ T. M. శేషగిరిశాస్త్రిగారి గ్రంథములు.

ఆంధ్రశబ్దతత్త్వము TELUGU PHILOLOGY. ఇందు ఆంధ్రవ్యాకరణము సంపూర్ణముగా కలదు, అరవము, కన్నడము, మలయాళము మున్నగు భాషలతో తెనుగునకుగల సంబంధము చక్కగ వివరింపబడియున్నది. తెలుగు పైలాలజీవిద్యార్థులకు ఉపయోగకరము. 2 భాగములు ... 3 0

అర్ధానుస్వార తత్త్వము, పైదాని కనుబంధము ... 0 8

*Notes on Aryan & Dravidian Philology* by the late Professor T. M. Seshagiri Sastriar. Old Copy. Reduced Price 2 0

ప్రకీర్ణము.

భగవద్గీత, భగవాన్ శ్రీ రమణమహర్షుల 'గీతారత్నమాలిక'తోను శ్రీ గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్యగారి వివరణోపోద్ఘాతములతో 1 8

విజయాశ్వచరిత్రము, శ్రీ పురాణము పిచ్చయ్యశాస్త్రిగారిది 2 0

వేదము వేంకటరాయశాస్త్రిగారి జీవితచరిత్రసంగ్రహము 2 0

*A Hand-book of Classical Samskrit Literature* for College Students, with questions and a Chronological Chart by U. Venkatakrishna Rao. M. A. 2 0

*Notes on the Study of the Preliminary Chapters of the Mahabharata* by Vedam Venkatachellam Aiyer B.A., B.L. 5 0

రామేశముగారీయుత్తరము జదివినవెంటనే యాతని మనసెంతయు నీరైపోయెను, అందుచే నాతఁడు గూడ నెట్టియాటంకమును చేయదలంచలేదు. లతిక తల్లియు నావార్త విన్నంతనే పరమానందభరిత యయ్యెను. కాని పైకి పొంగలేదు. ఆమె తావరిణయముం దిలకింపవలెననిగూడ యుండెను. గాని లోకమునకు వెఱచి యందులకు సాహసింపదయ్యెను.

రాగలతికకు భరతునకు మొదట నెట్లు పరస్పరప్రేమము గల్గినదో మీ రెఱుంగరు. దీనిని జెప్పుమని మీరాతురత పడుచుండవచ్చును. గాని యిది యొకవిధముగా చర్విత చర్వణమే. ఐనను దానిని వివరించెదను. రాజమండ్రిలో పాఠశాలా విద్యార్థులందఱికిని సాధారణముగా వితంతుశరణాలయ మత్యాకర్షనీయముగ నుండుటలో నాశ్చర్యములేదు. క్రొత్తయొకవింతయు, పాతదిరోతయు ననిలోకోక్తి గలదు. అందుచే నీనూతన వీరేశలింగ శతాబ్దములలో నీవితంతుశరణాలయ మాకర్షింపఁబడుచున్నది. ఇదిఁగాక నూతనవిషయములు నేర్చుకొనుటయందు విద్యార్థులెప్పుడు చురుకుగా నుందురు. ఇది మానవస్వభావమైనను, చిన్నతనమున నెక్కుడుగా నుండును. అందువలననే విద్యార్థిదశలో గ్రహించినన్నివిషయములు మనము పెద్దవారమైన పిమ్మట గ్రహింపఁజాలకున్నాము. విద్యార్థిదశలో గ్రహించిన యమూల్యవిషయముల నాచరణలో బెట్టుటయే మానవుని పరమావధియు, చరితార్థమునని విజ్ఞులు నుడువుదురు. ఇది సామాన్యమానవుల విషయము. జితేంద్రియులగు వారెప్పుడును విశేషవిషయములను గ్రహించుచుందురు. వారిప్రస్తావమిచ్చటఁ జెప్పఁదలచుకొనలేదు. భరతుఁడుతనపాఠశాలలో జదువుచున్నపుడాతఁ డప్పుడప్పుడు వీరేశలింగముగారి యుపన్యాసములను వినుచుండెడివాఁడు. ఆమహాత్ముని బోధలన్నియు భరతుని మనస్సు నాకర్షించినవి. ఆతఁడు చెప్పినట్లే తాను

గూడ చేయవలయునని భరతుని కుండెను. కాని ప్రకృతిబంధకము లెన్నియో నాతని సంకల్పతరంగములన్నిఁటిని చెదరగొట్టుచుండెను. ఐన నాతఁడా యుద్దేశ్యములను మార్చుకొనజాలకపోయెను. తల్లిదండ్రులు పూర్వాచారపరాయణులగుటచే వారి కిందేమాత్రము తెలిసినను తన్ను మన్నింపరని తోఁచెను. అందుచే నాతఁడు తనమనోభావము లన్నియు లోలోపలనే యడంచుకొనెను. తరువాత కొన్నాళ్ళకవి కార్యరూపమున పెట్టవలెననిసంకల్పించుకొనెను. తోడనేయాతఁడుశరణాలయ కార్యస్థానమునకేగి తనయుద్దేశ్యము నతిరహాశ్యముగా నచ్చటి యధికారి కెఱింగించెను. అప్పటికింకను బహిరంగముగా వితంతువుల వరించుటకై ధైర్యసాహాములు విద్యార్థిలోకమునకు లేకుండెను. ఆయధికారి యచ్చటివారిలో నందఱిని విమర్శించి, భరతునికులమువా రందులేరనిచెప్పెను. గాని యంతటితో నాతఁడు సంతృప్తిపడఁ డయ్యెను. సంకల్పసిద్ధుఁడను కావలసినదే యని భరతుఁడూహించుకొనుచుండెను. పిమ్మట నాతఁడొక్కింత యాలోచించి, వర్ణాంతరమైనను సరే, వధువిచ్చగించినచో నే నుద్వాహామయ్యెదనని పల్కెను. అప్పుడా యధికారికి రాగలతిక పేరు తలఁపునకు వచ్చెను. రాగలతిక కప్పుడప్పుడే పెండ్లియాలోచన లారంభమయ్యెను. వరాన్వేషణమునకై యాబిడయు లోలోన విచారించుచుండెను.

రాగలతికావిషయము ముచ్చటింపఁగనే భరతుఁ డాయధికారితో నామెను దనకు జూపి పరస్పరసంభాషణ కవకాశమిమ్మని కోరెను. దానిపై యాయుద్యోగి రాగలతికకా వృత్తాంతము డెల్పియాపె యిష్టముపై వారి సమావేశము నేర్పాటొనర్చెను. వారిద్దఱొండొరుల లావణ్యాతిశయముల జూచుకొని సంతృప్తులై కొలదిసేపు సంభాషణ జేసిరి. ఇర్వురు మరలవచ్చి యధికారికి దమసమ్మతి డెల్పియంత టినుండి పరస్పరముగా ప్రేమింపనారంభించిరి. భరతుఁ డామెను

